


# ఆంధ్రసచిత్రవారపత్రిక

17-8-73

50 పైసలు



తల్లి మాటలతో తలబిరుసెక్కిన అమ్మాయి, కన్నబిడ్డ సాయంతో కాపురం దిద్దుకొన్న వింతగాథ!
ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్
పల్లెటూరి బావ
నిర్మాత:
ఎ.వి.సుబ్బారావు
దర్శకత్వం
కె.ప్రత్యగాత్మ
సంగీతం: తాతినేని చలపతిరావు
మాటలు: భమిడిపాటి రాధాకృష్ణ
నవయుగ







# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938– 1972)

శుక్రవారం : 17–8–73
శ్రీ ప్రమాదీచ నామ సం॥ శ్రావణమాసం బ. షష్ఠి
సంపుటము : 66 సంచిక : 48
స్థాపితం 1908

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టి వీధి, మద్రాసు-1
విడి ప్రతి వెల 50 పైసలు

## విషయానుక్రమణిక

ముఖచిత్ర రచన :
శ్రీ బి. వెంకటరావు

# హైదరాబాద్ నోట్‌బుక్

## తిరుమల రామచంద్ర

**మళ్ళీ ఒకసారి**

కేంద్రప్రభుత్వం దేశీయాంగ మంత్రులు కొందరు, బ్రహ్మానంద రెడ్డి జూలై నెలలో హైదరాబాద్ నగరంలో జరిపిన చర్చల పర్యవసానంగా మరొకమారు ఇంద్రప్రస్థంలో ఆంధ్రనాయకులతో కేంద్రం సంప్రతిస్తుందనే వదంతులు వ్యాపించడంతో కొందరు శాసనసభ్యులు భుజాలు ఎగురవేసినా, పలువురు నిరాశపడ్డారనే అనవచ్చు. 'ఇదెలాగో? తెల్లవారేదా? ఢిల్లీకి వెళ్ళి రావడమంటే మాటలా? పూర్వమంటే మంత్రులుగా వుంటమి రాకపోకల ఖర్చంతా ప్రభుత్వం మీదే పడేది. ఇప్పుడు ఎవ్వరు ఇచ్చుకుంటారు?' అని గొణుక్కున్నారు కొందరు మాజీ మంత్రులు. అవును మరి! పాడి కాదంటే కాశీ వరకు డేకమన్నట్టు, మన జేబు కాదుగదా అని ఎప్పుడుబడితే అప్పుడు దేహళీ పురయాత్రకు సిద్ధమయ్యేవారు మన మహానాయకులు. ఇప్పుడు, చేతిచమురు భాగోతమంటే ఎవరికైనా కష్టమేకదా పాపం! ఒక ఎం. ఎల్. ఏ. మిత్రుడన్నాడు గదా, 'అంతా సక్రమంగానే సాగిపోతుండె, హరిశ్చంద్ర రాజ్యంలాగ. ఇక మాకెందుకయ్యా ఈ సస్పెన్స్?' అని. 'అలా అనకోయ్. ఇప్పుడే బాగుంది. రాష్ట్రపతి పరిపాలనలోనే సమస్యలన్నీ తీరిపోతే, మరెం తర్వాత హాయిగా వుండవచ్చు. ఈ సమస్యల గొడవ మనకెందుకు భాగహారంలో శేషం మిగిలినట్టు?' అన్నారు మరొక ఎమ్మెల్యే నెచ్చెలి. ఏమైనా, రాముడైతేనేమి రావణుడైతేనేమి అన్న మనస్తత్వం గతజనానికి హరిశ్చంద్రుడైనా ఒకటే; బ్రహ్మానందుడైనా ఒకటే సనే, భావం వ్యాపించడం సహజాతి సహజం.

**బీబీనగర్–నడికుడి రైలుమార్గం**

బీబీనగర్ – నడికుడి రైలుమార్గం మంజూరు కావడం జంటనగరాలవారికి చాల సంతోషం కలిగించింది. దీనితో ప్రయాణాల రద్దీ తగ్గిపోవడమే కాక కొన్నివేల మందికి జీవనోపాధి ఏర్పడి కొన్ని సంవత్సరాలపాటు కొన్ని సమస్యలు పరిష్కారమవుతాయి. తమిళనాడుతో పోలిస్తే మనకు రైలుమార్గాలు లేవనే అనవచ్చు. పెద్ద మార్గాలకంటె, ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ చాల ముఖ్యం. సమానాంతర రేఖలలో వున్న మార్గాలను కలిపే చిన్న అడ్డదారులే చాల ప్రయోజనకారులు. వీటి మూలాన ఐదు వందలమైళ్ళ పొడవున్న ఆంధ్రప్రదేశ్‌లో ఇంకా కనీసం 50 రైలుదార్లన్నా పడాలి. ఒక రోడ్డు పడాలంటే, మా వూరి మీదుగానే పడాలి, అనే మనస్తత్వం మన నాయకాగ్రణులకు ఉన్నంత వరకు దేనికీ దారులు పడవు.

**బోనాల పండుగ:—**

జులై 23న జంటనగరాలు అపూర్వ శోభతో కాకతీయుల నాటి వైభవాన్ని తలపించాయి. శుచిత్వం సాకారమై నడుస్తున్నట్టున్న రంగురంగుల మడి చీరలతో తలమీద బోనాలకుండలతో అమ్మవారి దేవాలయాలకు బారులుకట్టి నడిచిన ముత్తైదువులు, వారిముందు భేరీభాంకార పటహానకాది వాద్యనాదాలు, బోనాలకుండలపై వెలిగే గండదీపాలు చూడగా పారి శుద్ధ్యనాదజ్యోతి స్వరూపిణి అయిన జగదంబ అనేక రూపాలతో జంటనగరాల పౌరుల సముద్ధరణంకోసం వచ్చిందా అన్నట్టు తోచింది. ఈ బోనాలు — గుడమిశ్రిత ఉద్వోధనాలు, గ్రీష్మ తాపంతో తపించిపోయే ప్రపంచాన్ని చల్లబరచడానికి చిహ్నంగా జగదంబకు సమర్పింపబడి ఉంటుందనుకుంటాను. ఇదికూడా ఋతువుకు సంబంధించిన పండుగే, లేకపోతే పెరుగన్నమెందుకు? ఏమైనా, కులాల కలకలతో చెల్లాచెదరైన సంఘాన్ని సంఘటితం చేస్తున్న ఈ పండుగలు — పాదస్నాలు మినహాగా — నిరంతరం వర్ధిల్లనీ మహిళల మండలులతో పురవీథులు మండితం కానీ!

**శ్రీహర్షవర్ధన్:—**

'నాకు భారతీయ సంస్కృతి అంటే ప్రాణం. కనుక నేను అమెరికాలో స్థిరపడను. కొన్నేళ్ళు ఉండి, డబ్బు సంపాదించుకుంటాను. తిరిగివచ్చి హైదరాబాదులో స్థిరపడతానా' అన్నాడు కుర్రవాడు హర్షవర్ధన్ పిడికిలి బిగించి. హర్షవర్ధన్ సహజ పచ్చీసు యువకుడు, ఆజానుబాహువు. అందగాడు. సంస్కారం, విజ్ఞానం తొణికిసలాడే మాటామంతీ! ప్రస్తుతం ఇండియానా రాష్ట్రంలోని లాఫియెట్‌లో వున్న పర్‌డ్యూ విశ్వవిద్యాలయంలో ఇంజినీరింగులో పి.హెచ్.డి. చేస్తున్నాడు. ఉస్మానియాలో బి.ఇ. చేసి, అమెరికాలో ఎం.ఎస్. ముగించాడు. చిన్ననాటినుంచీ కుశాగ్రబుద్ధి. 'ఏమిటి మీరు తెలుగుదేశానికి పెళ్ళికోసం వచ్చారే; రాముడు మంచి బాలుడు,'. తల్లిదండ్రులు చెప్పినట్లు వినుటలాగ?' అన్నాను. 'మా విశ్వవిద్యాలయంలో దాదాపు 150 మంది భారతీయ విద్యార్థులున్నారు, వారిలో మేము 15 మంది తెలుగువారం. అక్కడి సంస్కారాన్నిబట్టి పెళ్ళికిగాని, శృంగార జీవనానికిగాని అటంకం లేదు. అక్కడి

> పాఠకులకి, రచయిత(త్రు)లకి మా స్వాతంత్ర్య దినోత్సవ శుభాకాంక్షలు.
>
> స్థలాభావంవల్ల ఈ వారం 'నిధులకోసంవేట' శీర్షిక వెయ్యలేకపోతున్నాము.
>
> —సంపాదకుడు.

ఉంటారు. సెక్స్ విషయంలో ఇష్టం లేక పోతే 'అబ్బాయ్, ఈ విషయంలో నాకు నీవు నచ్చవు. వెంటబడకు' అని ధైర్యంగా చెబుతారు. ఇక్కడివారిలాగ చెప్పలు

## హైదరాబాద్ ...



తీసుకోడం, కిరికిరి చేయడం వుండదు' కాని, నాకు నా తల్లి తోడు, దేశం సంస్కృతి ఇష్టం' అన్నారు నవ్వుతూ. 'మరి మీ బోటి మేధావులు మనదేశంనుంచి వెళ్లిపోతే మనదేశంలో తెలివితేటలు కరువై పోవా?' అన్నాను. 'నే నేమి మేధావిని! నాకు ఇక్కడ వుండడం ఇష్టమే. ఎక్కువ జీతం లేకపోయినా, నచ్చినపని' చేసిన పనికి మెప్పు చాలు. కాని, నా మిత్రుని అనుభవంలో ఇది కనిపించడం లేదు. ఎంతకూ నేను కొన్ని సంవత్సరాలే ఉంటాను అమెరికాలో'' అన్నాడు. వినయంగా. 'అమెరికా వారి ప్రవర్తన ఎలా వుంది మీకు?' అడిగాను. 'సామాన్య అమెరికనులకు మన దేశం గురించి తక్కువగా తెలుసు. మాతో బాగానే మసలుకుంటారు. వారు అన్నిటి కన్నా డబ్బుకు ప్రాధాన్యమిస్తారు. మనకు డబ్బంటే చేదని కాదు. కాని, అగ్రస్థానం కాదని నా నమ్మకం.' అన్నారు ఆయన విమర్శగా. 'ఇన్ని కులాలు, భేదాలు చీకిరి బాకిరిగా వున్న మన సంస్కృతి అంటే అంత ఇదెందుకండీ?' అన్నాను. 'ఈ భేదాలు పూర్వంలేవు. ఇప్పటికైనా పోయేవే. మనతత్త్వ భావన, సంస్కృతి సార్వకాలికాలు; అని విదేశాలకు వెళ్ళిన తర్వాత నాకు నమ్మకం బలపడింది.' అన్నారు దృఢంగా. హర్షవర్ధన్ కమర్షియల్ టాక్సుఆఫీసర్ శ్రీ కుందూరు మోహన్‌రెడ్డి కుమారుడు, తల్లి శ్రీమతి వసుంధర, తెలుగుసాహిత్యం పట్టభద్రురాలు. శ్రీ హర్షవర్ధన్‌కు శ్రీ చిర్ల రామన రెడ్డి (రాఘవ అండ్ రామన) కుమార్తె సౌ రోహిణికి ఆగస్టు 3న వివాహం వైభవంగా మద్రాసులో జరిగింది.

**ఉపశ్రుతి**

'ఏంది మేస్త్రీ, గావం (జీతం) తగ్గిస్తేనేమో కిరికిరీ చేస్తవు. పనిరిట్టు పనలేక పాయె;' అన్నాడు ఇల్లు కట్టిస్తున్న గృహస్థు. 'ఏంది దొరా! ఎమ్మెల్లే దొస్తం పనీ గిట్టాలేక జీతం తింటుండరే!' అన్నడు మేస్త్రీ నవ్వుతూ. ●


1973 స్వాతంత్ర్యదినోత్సవ విన్యాసం
విషయాలని అర్థంచేసుకోడానికి వాళ్ళకు కొంత టైం కావాలి
ఆంధ్ర సమస్యపై బ్రహ్మానందరెడ్డి నివేదిక
అదంతా మనం చేస్తే చేసి ఉండవచ్చు. కాని ఆయన దాన్ని ఎందుకు చెప్పాలి?
లక్నోలో రాష్ట్రపతి ప్రసంగం
5 వ ప్రణాళిక
గుర్రం పారిపోతోంది పట్టుకోండి!
ధరలు

సీరియల్




# విడిన మబ్బులు

**తమిరిశ జానకి**

### జ రి గి న క థ

నిలయ చెల్లెలు లోక. రోగంతో తీసుకుటున్న ముసలితండ్రి ఒకడున్నాడు. సంసారం బాధ్యత అంతా నిలయదే. ఆమె ఒక ఆఫీసులో పని చేస్తున్నది. ఆ ఆఫీసులోనే పని చేస్తున్న భాస్కర్రావు ఆమెని పెళ్ళాడతానన్నాడు. కాని, కుటుంబ పరిస్థితి దృష్ట్యా నిలయ అంగీకరించ లేదు. లోకకి సినిమాలంటే పిచ్చి. ఆమెకి తగిన వాడే మోహన్. సినిమాల్లో చేర్పిస్తానని లోకని మద్రాసు తీసుకు వచ్చాడు మోహన్. నిలయా మధూ ఒకరినొకరు ప్రేమించుకున్నారు. కాని మధు తల్లి అందుకు సమ్మతించలేదు. వేరే సంబంధం గురించి చెప్పింది. మధు తల్లడిల్లి పోయాడు. లోక గర్భవతి అయ్యాక మోసంచేసి వెళ్ళిపోయాడు మోహన్. జయ ఆమెకి మంచి స్నేహితురాలు. తన తండ్రితో నిలయ పార్కులో కనిపించిందని విన్నాక జయ మనసు మనసులో లేదు. సుజాత చెప్పినదంతా శ్రద్ధగా విన్నాడు సుందర్. సుందర్‌ని కవిశాక జాన్సీ మనసులో అలజడి తగ్గింది.

## 12

ఆరోజు సాయంత్రం కనుచీకటి పడుతుండగా వచ్చిన రామనాధంగార్ని ఒక్క క్షణం పరికించి చూసింది నిలయ.

'ఏమిటలా కొత్తవాడిని చూసినట్టు చూస్తున్నావు. లోపలికి రానివ్వవా ఏమిటి?' అంటూనే చనువుగా లోపలికొచ్చి కూర్చున్నారాయన. తన మొహంలో భావాలు ఆయన కనిపెట్టకుండా ఉండడానికన్నట్టు చటుక్కున దృష్టి మర్రో ప్రక్కకి తిప్పుకుంది నిలయ.

'అలా ఉన్నావేం? ఒంట్లో ఎలా ఉంది?'

'ఎలా ఉన్నాను?'

'నిలయా!'

'ఊ!'

కుర్చీలోంచి లేచి రెండడుగులు ముందుకి వేశారు రామనాధంగారు. చిన్నగా కంపించింది నిలయ శరీరం. తమాయించుకుని ధైర్యంగా చిరునవ్వు నవ్వింది. నిజం చెప్పెయ్యాలని తను నిశ్చయించుకున్న సంగతి మరోసారి గుర్తు చేసుకుంది తనకి తనే. 'మీకో సంగతి చెప్పాలి' అంది చివరికి.

'నేనూ నీకోటి చెప్పాలి. ఇంకా నన్నెందుకేడిపిస్తావు, ఇలా దగ్గరగా రా. ముందు నేను చెప్తాను.' నిలయ చేతులు ఆయన చేతిలో చిక్కుకున్నాయి. 'రామనాధంగారూ!' అంతలోనే మారిపోయిన నిలయ కంఠస్వరానికి అమితంగా ఆశ్చర్యపోయారాయన. గుడ్లప్పగించి చూస్తూ నిలబడి పోయారు, 'నేనాడే నాటకం ముగించదల్చుకున్నాను రామనాధంగారూ!'

నిలయ మాటలకి తెల్లబోయారాయన. ఏమిటి నిలయా! నువ్వనేది 'ఏమిటి?'

'అదే చెప్తాను. ముందు మీరు కూర్చోండి.' నిలయ మొహం చూసి మరి మాట్లాడే ధైర్యంలేక, చేసేది లేక కుర్చీలో కూలబడ్డారు. మొట్టమొదటి రోజు, జయ తనకి చెప్పిన విషయం, ఆ పిల్ల పడిన మనోవేదన వివరంగా ఆయనకి చెప్పింది నిలయ. రామనాధంగారి ముఖం తెల్లగా పాలి పోయింది. 'ఆరోజు నేనింటికొచ్చాక రాత్రంతా ఆ విషయాన్ని గురించే ఆలోచించాను. చివరికి నాటకమాడి మిమ్మల్ని మంచి మనిషిగా చెయ్యాలన్న నిశ్చయాని కొచ్చాను. మీతో స్నేహం చేశాను. మీకు దగ్గరైనట్టే అవుతూ దూరంగా ఉంటూ నెమ్మదిగా మీలో మార్పు తీసుకొచ్చాను. ఇంటి బాధ్యతలు మీరు గుర్తించేటట్టు చేశాను. నేననుకున్నది సాధించగలిగినందుకు నాకు చాలా ఆనందంగా ఉంది. ఇదంతా వింటుంటే మీకేదో కథ వింటున్నట్టనిపిస్తోందా? కానీ కథ కాదు, నిజమేనని మీ అనుభవమే చెప్తోంది కదూ!'

'నిలయా!' రామనాధంగారి పిలుపులో ఈసారి కోరికగానీ, ఉద్రేకంగానీ లేవు. అంతా విన్నాక అప్రయత్నంగా కలిగిన జాలీ, ఆప్యాయతా ఉన్నాయా పిలుపులో.

'ఎందుకు నిలయా! ఎందుకిలా చేశావు. ఎందుకింత మంచితనం నీలో! నాకోసం... నాకోసం. నా కుటుంబం కోసం నీ బతుకు నవ్వులపాలు చేసుకున్నావు. ఎందుకిలా చేశావు?'

'మీరు కూడా అలాగే అంటున్నారా? ఎందుకు పుట్టించాడో నాలో, భగవంతుడు అటువంటి ఉద్దేశం కలిగించాడు. నా ప్రయత్నం సఫలమైంది. అంతే చాలు. అదే నాకు పదివేలు.!'

'కానీ, నువ్వు చేసిన ఈ పనివల్ల నీకు చెడ్డపేరు రాదూ సంఘంలో?' రామనాధం గారి ప్రశ్నకి నవ్వేసింది నిలయ.

'ఏమీ లేకపోయినా, ముక్కు మూసుకని నాలుగ్గోడల మధ్యా కూర్చున్నా ఒంటరి ఆడదాని మీద నిందలుమోపి, పేర్లు పెడుతుంది సంఘం. అటువంటప్పుడు నేను సదుద్దేశ్యంతో చేసిన ఈపని...'

'నిజమే నిలయా! నువ్వు సదుద్దేశ్యంతోనే ఈపని చేశావు. నీపట్ల నేను ఆలోచించిన తీరూ, నా ప్రవర్తనా తల్చుకుంటే నా మీద నాకే అసహ్యం వేస్తోంది. సిగ్గుతో నా మనసు కుంగిపోతోంది.'

'బాధపడకండి. మీ మనసు మారటమే నాక్కావల్సింది.'

'కానీ, నిలయా, కథల్లో తప్ప నిజ జీవితంలో నీవంటి వాళ్ళుంటారంటే నమ్మే లోకం కాదిది. లేనిపోని ఊహలతో, నిందలతో నీ బతుకు నాశనం చేస్తుంది. అదే నాకు బాధగా ఉంది.' ఒకప్పుడు లేనిపోని

మాటల్తో, నిందలతో ఆఫీసులో తనని బాధించిన రామనాథంగారు, లోకం మంచిది కాదు లేనిపోని మాటలంటుంది అంటే నవ్వొచ్చింది నిలయకి.

'నన్ను క్షమించానని నువ్వంటే గాని నాకు తృప్తిగా ఉండదు నిలయా! నా కళ్ళు తెరిపించావు. నాకు బుద్ధిని ప్రసాదించావు.'

'అంతంత పెద్ద మాట లెందుకు లెండి. నా గొప్పతనం ఏమీ లేదు. మీకు జయ లాంటో నేను కూడా అంతే అను కుంటే నాకు తృప్తిగా ఉంటుంది.'

రామనాథంగారి కళ్ళల్లో నీరు నిలయ కంట పడింది. 'ప్రతి మనిషికీ ఒక మనసుంటుంది. జీవితంలో ఎప్పుడో అప్పుడు అది తన మానవత్వం బుజావు చేసుకుం టుంది. లేకపోతే భార్య పోయినా కంట తడిపెట్టని ఆయన పశ్చాత్తాపంతో ఇప్పుడు కన్నీరు కారుస్తున్నారు.' మనసు లోనే అనుకుని ఆయన మీద జాలిపడింది నిలయ.

'జయకి కూడా ఈ సంగతి తెలియదు. ఎన్నిసార్లో తనతో ఈ మాట చెప్పాలని చూశాను. వీలుపడింది కాదు. తెలియక నా మీద కోపంగా ఉంది జయ.'

'రేపు సాయంత్రం రమ్మని జయకి కబురంపుతాను. నువ్వు కూడా మా ఇంటికి రేపు సాయంత్రం రావాలి. జయకి కూడా అసలు సంగతి చెపుదువుగాని. రేపు రాత్రి మా ఇంట్లోనే నీ భోజనం. సరేనా!'

నవ్వింది నిలయ అంగీకార సూచకంగా. తల మీంచి ఒక పెద్ద బరువు దిగిపోయి నట్లయింది. తృప్తిగా చూసింది.

* *

'చాలా సంతోషం ఝాన్సీ!' ఝాన్సీ పెళ్ళి శుభలేఖ చూస్తూ అంది నిలయ.

'ఇప్పుడే నా అభినందనలు అందుకో. అప్పుడు నే నుండను కాబట్టి.'

'అంటే!' తెల్లబోయింది ఝాన్సీ. 'ఎందుకుండవు? ఎక్కడికి కెళ్తావు?'

'నేనొకటి రెండుసార్లు నీతో అన్నాను గుర్తుందా? వేరే ఊళ్లో ఎక్కడన్నా ఇంకో ఉద్యోగంకోసం ప్రయత్నం చేస్తాను. ఈ ఊళ్లో ఉండలేనని.'

'ఔను. కాని నువ్వు వేళాకోళానికలా అన్నావనుకున్నాను. నిజం చెప్పు. ఇంకో చోట ఉద్యోగం దొరికిందా? వెళ్ళి పోతావా?'

'ఊఁ'

'ఎందుకు నిలయా? ఎందుకీఊర్నించి వెళ్ళిపోవాలని చూస్తున్నావు?'

భాస్కర్రావు, విశ్వనాథంగారు, రామ నాథంగారు, ఒంటరి ఆడదనే లోకువతో ఏవేవో కథలు కల్పించే ఆఫీసులో సిబ్బంది వరసగా అందరూ కళ్ళముందు కదిలారు నిలయకి.

'నీకు తెలియదు ఝాన్సీ! నా బాధ నీ కర్థంకాదు. ఈ ఊరికి దూరంగా పారి పోతేనేకానీ నా మనసుకు ప్రశాంతత చిక్క టట్లులేదు. ఇక్కడే ఇలాగే మరికొన్నా ళ్ళుంటే నాకు పిచ్చెక్కేటట్టుంది. అందుకే స్థలం మార్చుకావాలి. అదృష్టంకొద్దీ నా ప్రయత్నం ఫలించి త్వరలోనే మరోచోట ఉద్యోగం దొరికింది. నన్ను మర్చిపోవు కదూ!'

చటుక్కున నిలయని దగ్గరగా తీసుకుని 'నిన్ను మర్చిపోతానా నిలయా! కాని మరో సారి బాగా ఆలోచించి నీ ప్రయత్నం మానుకో నిలయా!' అంది ఝాన్సీ.

నిలయ గుండెల్లో గుబులు బయ ల్దేరింది.

'పుట్టి పెరిగిన ఊర్ని ఇన్నేళ్ళుగా



## 'ప్రేమలో ఎవరూ సిన్సియర్‌గా వుండరు'

'ఒక రూపాన్ని ఛిద్రంచేసి మరోరూపంలో ప్రతిబింబింప చేసేదే క్రియేటివ్ ఆర్ట్. పచ్చగా వున్న ఆకుని ఎర్రగా చూపించడంలో కొత్తదనం వుంటుంది. ఇది సామాన్యజనానికి అర్థం కానవసరం లేదు.'—మాడర్న్ పెయింటింగ్‌మీద ఇది బండారం సూర్యకుమార్ అభిప్రాయం. మద్రాసు కాలేజ్ ఆఫ్ ఆర్ట్స్‌లో పోస్టుగ్రాడ్యుయేట్...అడ్వాన్స్‌డ్ పెయింటింగ్ అతని సబ్జెక్టు.

సెక్స్ పుస్తకాలు చదువు తుంటాడు. మ్యాడ్ పెయింటింగ్ బాగా స్టడీ చేశాడు. రెండుసార్లు తన పెయింటింగ్స్ ఎగ్జిబిషన్ పెట్టాడు.

సినిమాలు ఎక్కువగా చూస్తుంటాడు. సినిమాలకి పబ్లిసిటీ చూసి వెళ్తాడు. అవుట్

### క్విక్కింటర్వ్యూ

డోర్‌లో తీసినవి ఆర్టిస్టిక్‌గా కనుపించడానికి అవకాశముంటుంది. 'బుద్ధిమంతుడు' ఆర్టిస్టిక్ పిక్చర్ అనిపించింది—అన్నాడు. ఇతనికి బాగా నచ్చిన చిత్రం మూగ మనసులు.

హీరోల్లో నాగేశ్వరరావు బెటర్. అతనివి కొన్ని బాగుండవు—అన్నాడు. సూర్యకాంతం ఇతని అభిమాన నటి.

రాజకుమార్ జయభాదురి, శ్రీగానటస్తారట. అందుకని వాళ్ళంటే ఇష్టం.

'సినిమాలు చూడ్డానికి టైమంటూ, ఏం వుండక్కర్లేదు. రిలాక్సేషన్‌కోసం పరీక్షల్లోకూడా వెళ్తుంటాను' అన్నాడు. ఇంకా టైం పాస్ కాకపోతే గర్ల్స్ మ్యాడెంట్స్‌తో పిచ్చాపాటీ వేస్తాడట. మాడల్స్ దగ్గర్నుంచి మాడర్న్ ఆర్ట్‌దాకా ప్రపంచ విషయాలన్నీ మాట్లాడుకుంటారట.

'ప్రేమలో ఎవరూ సిన్సియర్‌గావుండరు. నిజమైన ప్రేమ అనేది కథల్లోను, తెర మీద కనిపిస్తుంది. పెళ్లి చేసుకుని ప్రేమించాలని నా కోరిక. అన్నాడు తన ఆర్టిస్టిక్ అనుభవంతో... ప్రేమ అంటే ఒక రకమైన



సూర్యకుమార్

'నమ్మకం' అని ఇతని అభిప్రాయం.

పాలిటిక్స్ అంటే ఇంటరెస్ట్ లేదు. పాప్ మ్యూజిక్ అంటే ఇష్టం. మాడర్న్ వేష భాషల మీద కుతూహలం లేని మాడర్న్ పెయింటర్ సూర్యకుమార్ స్కాలర్‌షిప్ దొరికితే ఫారిన్ వెళ్లాలనుకుంటున్నాడు. లేకపోతే సినిమాల్లో ఆర్ట్ డైరెక్టరుగా స్థిరపడ తారట.!!

—సికరాజు.

## వీడిన మబ్బులు

పెట్టి ఉందో లేదో. అది సరేగాని నువ్వు మన ఊరొదిలి ఇక్కడికెందు కొచ్చావు? ఏం జరిగింది?'

అన్నీ వంగళ్ళూ వివరంగా చెప్పింది విజయ. 'ఇక్కడ శ్యామల ఉండడం ఒక విధంగా నా మంచికే. శ్యామల నీకు తెల్సు కదూ! బి. ఎ.లో నా క్లాస్‌మేట్. తనే నాకు మా ఆఫీసుకి దగ్గర్లో ఈ ఇల్లు చూపి పెట్టింది. వాళ్ళాయనతో కల్సి స్టేషన్‌కి వొచ్చి మొదట వాళ్ళింటికి తీసి కెళ్ళింది. ఎంతో సహాయం చేసింది. వాళ్ళిల్లు కూడా ఇక్కడికి బాగా దగ్గిరే. భగవంతుడు మనిద్దర్నీ స్టేషన్లో కలిపి చాలా మేలు చేశాడు. శ్యామలా వాళ్ళమ్మగారికి సీరియస్‌గా ఉందని టెలిగ్రామ్ వొచ్చింది. వాళ్ళాయన ఊళ్ళోలేడు. క్యాంపు వెళ్ళాడు. తనకి కాళ్ళా చేతులూ ఆడలేదు. ఆ టెలిగ్రామ్ చూపి. 'స్టేషన్ కెళ్లి రైలెక్కేలోపల కాళ్ళల్లో వణుకుతో ఎక్కడ కూలబడతానో ఏమో స్టేషన్‌కి నాతో

రాగలనా? అడిగింది: ఈ మాత్రం చిన్న సాయం చెయ్యలేనా అని వచ్చాను. శ్యామ లెక్కిన రైలు కదిలాక వెనక్కి తిరిగి వస్తుంటే నువ్వు కనబడ్డావు. నిజంగా నేను చాలా అదృష్టవంతురాల్ని. భగవంతుడు మనిద్దర్నీ ఒకచోట చేర్చి మేలు చేశాడు.' అంటూ ముగించింది విజయ.

ఆ తర్వాత కొంచెం సేపటికి విజయకి నిద్ర పట్టింది గాని ఆలోచనల్తో నిద్ర పోలేక పోయింది లేఖ. తెల్లవారబోతుండగా ఒక దృఢ నిశ్చయానికొచ్చి, పక్కకి తిరిగి కళ్ళు మూసుకు పడుకుంది.

ఆరోజు ఆఫీసు నించి ఇంటికొచ్చేటప్పటికి గుమ్మంలోనే ఎదురుపడింది పని మనిషి. 'ఆ అమ్మగారెటో ఎళ్ళారండి. మీరొచ్చేదాకా పిల్లనిక్కడ ఉండమంటే ఉన్నాను. చంటిపిల్ల లోపల నిద్రవుతా ఉంది.' అంది.

'సరే! నువ్వెళ్ళు.' అని దాన్ని పంపేసి లోపలికి వచ్చిన నీలకి చెల్లెలెక్కడికి వెళ్ళి ఉంటుందన్న సందేహం కలిగింది. కింద చాపమీద నిద్రపోతున్న పాప ... ముద్దులు మూట కడుతున్న పాప ... అన్యమనస్కంగా చెప్పులు విడిచి, కాళ్ళు కడుక్కొచ్చి పాప పక్కనే చాపమీద కూర్చుంది. చాపమీద దిండుకింద రెపరెప లాడుతూ కనపడిందిఓ కాగితం... యధాలాపంగా చేతిలోకి తీసుకుంది.

'ప్రియమైన అక్కయ్యకి' ... అన్న అక్షరాలమీద కళ్ళు ఆగిపోయాయి. ఏమిటిది?...వణుకుతున్న చేతుల్తో ఆకాగితాన్ని గట్టిగా పట్టుకుంది విలయ.

'ప్రియమైన అక్కయ్యకి,

ఎంతో ఆలోచించినమీదట నేనీ నిర్ణయానికొచ్చాను. మోహన్ ఎప్పుడో వస్తాడని నన్ను, పాపనీ చేరదీస్తాడని అనుకోవడం అవివేకమనిపిస్తోంది. అసలు ఎప్పుడైనా, ఎక్కడైనా మోహన్ కనపడినా నన్ను భార్యగా ఒప్పుకుని స్వీకరించే ధైర్యం అతనికి లేదు. అటువంటి ధైర్యమే ఉండి ఉంటే పరిస్థితి ఇలా ఉండేదే కాదు. నేనెవరో తనకి తెలియనట్టే మాట్లాడితే ఆడదాన్ని నేనేం చెయ్యగలను? సంఘం మగవాడి మాటలు నమ్మినంతగా ఆడదాని మాటలు నమ్మదు. అందుకని మోహన్ కనపడినాకూడా ప్రయోజనం శూన్యమనే

అభిప్రాయం స్థిరపడిపోయిందిప్పుడు నాలో. నా బోటిది బ్రతికుంటే నీ క్కూ భారమే! ఒకరోజా రెండురోజులా? జీవితాంతం వేధించే సమస్య ఇది. అసలు మోహన్ ఎప్పుడైతే నన్నొదిలి వెళ్ళాడో అప్పుడే ఆత్మహత్య చేసుకోవల్సింది. కానీ పుట్టబోయే మరో ప్రాణిని అంతం చెయ్యవల్సి వస్తుందన్న బాధతో కడుపులోసిసి బ్రతుకుభారంగా నెట్టుకొచ్చాను. ఇప్పుడు నేను లేకపోయినా, నా బిడ్డని ఏ లోటూ లేకుండా కాపాడే అండ చూపించాడు భగవంతుడు. నీ పోషణలో, నీ రక్షణలో నా పాపకి ఏ లోటూ, ఏ కొరతా ఉండదు అందుకే పాపని గురించిన బెంగ నాకికలేదు. చితికిపోయిన మనసుతో, గుండె పిండిన ఆవేదనతో, కళ్ళల్లో నిరంతరం కదలాడే నిరీక్షణతో రోజులు భారంగా దొర్లించే ఓపిక నాకింక లేదు.

పాప తండ్రెవ్వరని నలుగురూ అడిగే ప్రశ్నలకి సమాధానం ఏమని చెప్పను? రాను రాను నా వేదన మరింత పెరుగుతుందే తప్ప తరిగే ఉపాయంలేదు. ఇన్నాళ్ళూ పాపకోసమే బ్రతికి ఉన్నాను. ఇప్పుడు పాపకి అండ నువ్వున్నావు నాకా విషయంలో అపనమ్మకం లేదు. అందుకే నా జీవితానికి ముగింపు చెప్పదల్చుకున్నాను. నాకోసం వెదికి ప్రయోజనం లేదు. నా గురించే ఆలోచిస్తూ మనసు పాడుచేసుకోకు. నేను బ్రతికుంటే రోజూ నీ ఎదురుగా ఉండి నీ గుండెల్లో ఆరని మంట రగిల్చినదాన్నవుతాను. నేనీ భూమ్మీంచి తప్పుకుంటే మొదట్లో కొన్ని రోజులు నాకోసం కన్నీరుకార్చినా తర్వాత తర్వాత నా గురించిన నిరంతరవేదన నీకుండదు. అదే నాక్కావల్సింది. నన్ను క్షమించమని అడగటానికి కూడా అర్హత లేని నిర్భాగ్యురాలు. —నీ చెల్లెలు,
లోక.'

ఆత్రంగా ఉత్తరం అంతా చదివిన విజయ కళ్ళల్లో నీళ్ళు నిండాయి 'ఎంత పని చేశావు లోకా! ఎంతపని చేశావు. ఇన్నాళ్ళకయినా భగవంతుడు కరుణించి నా చెల్లెల్ని నా దగ్గిరికి చేర్చాడని ఎంతో ఆనందించాను. నువ్వు నాకు బరువా? నువ్వుంటే నాకు సంతోషంగాని, లేకపోతే నా మనసు అశాంతిపాలే కదా! ఆరోజు నువ్విల్లు విడిచి వెళ్ళిపోయినది మొదలు నిన్నుగురించి ఆలోచించకుండా ఏ రోజూ కంటినిండా నిద్రపోలేదు. ఏ అఘాయిత్యమూ తలపెట్టక ముందే నిన్ను నేను కలుసుకున్నందుకు తృప్తిగా గాలిపీల్చుకున్న నన్ను మళ్ళీ వేదనలో ఎందుకు ముంచుతున్నావు? పెద్ద పొరపాటే చేశావు లోకా. ఈ సంఘమంతా ఏకమై మాటల ఈటెలతో నీమీదికి వచ్చినా, నీ అక్కయ్య అండ ఉండగా నీకేం భయం లేదని నన్నొక్కసారి చెప్పనీ. తిరిగి వచ్చెయ్యి లోకా! వచ్చెయ్యి.' విజయ మనసు దుఃఖంతో ఆక్రోశించింది. ఏడ్చి ఏడ్చి గుండెలవిసి పోయాయి. పాప లేచి అటూ ఇటూ కదులుతూ ఏడుపు మొదలు పెట్టింది.

ఉలిక్కిపడి ఈలోకంలోకి వచ్చింది విజయ

* * *

రోడ్డుమీద నడుస్తోందన్న మాటేగాని లోక మనసు ఆలోచనల్లో మునిగిపోయింది. ఎన్నికార్లు ... ఎన్నిబస్సులు రయ్యి రయ్యిన పోతున్నాయి. ఇంక ఆలస్యం చెయ్యకూడదు. దేనికిందోపడి ఈలోకానికి దూరమవ్వాలి. చటుక్కున పాప గుర్తొచ్చింది. గుండె పిండిన బాధ. ఏదో బంధం వెనక్కి లాగుతోంది నిరాశ ముందుకి పొమ్మంటోంది. ఈమధ్యావస్థలో తనుచేస్తున్నది పొరపాటేమోనన్న కొత్త ఆలోచన మొలకెత్తింది... ఔను ..బాధలకీ, అవమానాలకీ దూరంగా మరో లోకంలోకి వెళ్ళిపోవాలని చూస్తోంది తను. కానీ...పెళ్ళికాని అక్కయ్య మాత్రం ఆ పాపవల్ల అపనిందలకి గురికాదూ! సంఘానికేమని జవాబు చెప్తుందక్కయ్య చెల్లెలి కూతురంటే నమ్ముతుందా లోకం. భగవాన్! ఈ ఆలోచన ముందే ఎందుకు రాలేదు తనకి. తనీబాధల్నించి విముక్తి పొందాలన్న కోరికతో ఏపాపమూ ఎరగని అక్కయ్యని అపనిందలపాలు చెయ్యటమా? వొద్దు...వొద్దు...నాపాప అక్కయ్య జీవితానికి ప్రతిబంధకం కాకూడదు...లోక మనసుని ఆవేశం, ఉద్రేకం, బాధ, భయం కలిపి ఊపివేశాయి. కళ్ళు చూస్తున్నాయన్న మాటేగానీ ఆ కళ్ళముందు కన్నబిడ్డరూపు అక్కయ్యరూపు తప్ప మరేమీ కానరావట్లే ఆత్రుతతో, ఆవేశంతో పరుగులాంటి నడకతో ముందుకి నడిచింది రోడ్డు కటువైపు వెళ్ళడానికి. అంతే...రయ్యిన దూసుకువచ్చే నల్లనికారు ఆకలితో మీదకి దుమికిన భూతమే అయింది. ట్రాఫిక్ ఆగి పోయింది...జనం గుమికూడారు.



"స్వతంత్ర దినం కోసమని స్పెషల్‌గా ఉతికి ఎత్తమ్మంటే...ఇలాగా?"

# సర్వం విష్ణుమయం జగత్

ధర్మపథం



బులుసు వెంకటరమణయ్య

ఈ సమస్తమైన జగత్తూ విష్ణుమయమే అని దీని అర్థం. 'ఇందుగలడందు లేడని, సందేహము వలదు' అన్నట్లుగా భగవంతుడు సర్వవ్యాపి అని దీని అభిప్రాయం.

విష్ణువనే శబ్దానికి సర్వవ్యాపకుడని అర్థం!

సర్వమూ విష్ణుమయమే అయి ఉన్న విషయాన్ని ఈ శ్లోకం తెలుపుతున్నది—

'జలే విష్ణుః స్థలే విష్ణుః<br>
తేజో విష్ణుర్నభోఽనిలః<br>
చరాచరస్థితో విష్ణుః<br>
సర్వం విష్ణుమయం జగత్.'

విష్ణువు పృథివ్యప్తేజోవాయ్వాకాశాలనే పంచ భూతాలయందున్నూ, చరములయందున్నూ, అచరములయందున్నూ వ్యాపించి ఉన్నాడనీ, అందువల్ల ప్రపంచమంతా విష్ణుమయమే అనీన్నీ దీని అభిప్రాయం.

విష్ణువు సర్వవ్యాపకుడై ఉన్నందున అందరినీ రక్షించవలసినవాడు ఆ దేవదేవుడే అని ఆయనను నమ్ముకొని ఉండడం దైవ విశ్వాసంగలవారి స్వభావం.

ఆ విష్ణుదేవుడు ఆ యా స్థలాలకు తగినట్లుగా అవతారమూర్తులను ధరించి దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేస్తూ ఉంటాడు. అందువల్ల ఆయనను ఈ రీతిగా ప్రార్థిస్తారు.

'జలే రక్షతు వారాహః<br>
స్థలే రక్షతు వామనః<br>
అటవ్యాం నారసింహశ్చ<br>
సర్వతః పాతు కేశవః'

వరాహావతార మెత్తిన దేవుడు హిరణ్యాక్షుని సంహరించి, ఆ రాక్షసుడు సముద్రంలో ముంచివేసిన భూమిని పునరుద్ధరించి, యథాస్థానంలో ఉంచాడుగదా! నీటి అపాయం సంభవించినప్పుడు ఆ వరాహమూర్తి రక్షించాలని అభిప్రాయం. వామనావతారకాలంలో విష్ణువు త్రివిక్రముడై, భూమినంతా ఒక పాదంతో ఆక్రమించాడు. అట్టి దేవుడు స్థలసంబంధమైన అపాయాలనుంచి రక్షించాలని అభిప్రాయం. మృగరాజరూపాన్ని ధరించిన దేవుడు అడవిలోని అపాయంనుంచి తప్పించాలని ఈ రీతిగా కేశవుడు సర్వస్థలాలలోను రక్షించాలని భక్తుల ప్రార్థన.

విష్ణుభక్తులు సర్వరక్షకుడైన విష్ణువును పై విధంగా ప్రార్థిస్తారు. ●

---

## వీడిన మబ్బులు

'అబ్బే! కారు డ్రైవరుదేం తప్పులేదు. చెవులు చిల్లులు పడేటట్టు హారను మోగిస్తూనే ఉన్నాడు' అని ఒకరంటే. 'కావాలని చచ్చిపోవాలని పరిగెత్తుకొచ్చి కారుకింద పడితే ఎవరుమాత్రం ఏం చెయ్యగలరు? ఏదో...జీవితంమ్మీద విరక్తిపుట్టిన బాపతే ఇది. లేకపోతే ఎదురుగా కారురావడం చూసి కూడా, కారుదగ్గరకు వచ్చేలాక రోడ్డు కడ్డుపడుతుందా?' అని మరొకరు వ్యాఖ్యానాలుచేస్తూ నిలబడ్డారు జంతా.

కారులోంచి డ్రైవరూ దిగాక, వెనకే రాజారావుగారూ దిగారు. డ్రైవరూ, కారూ పోలీసుల పరమయ్యారు. తన డ్రైవరుకి భయమేంలేదని ధైర్యం చెప్పారు రాజారావుగారు. కారణం, కారుకిందపడ్డ యువతిదే తప్పనీ, డ్రైవరు తప్పేమీలేదని అందరూ గమనించిందే...రాజారావుగారు డాక్టరవడం వల్ల ఆయనదా ఊరు కాకపోయినా, అక్కడి జనరల్ హాస్పిటల్లో డాక్టర్లతో పరిచయ ముందాయనకి. ఊరూ, పేరు తెలియని, తనకారు కిందపడ్డ యువతి కోలుకునేదాకా హాస్పిటల్ చుట్టూ తెగతిరిగారాయన. లోకకి తలకి పెద్దదెబ్బే తగిలింది. ఆమెవరో తెలియకపోయినా ఆయన మనసు వ్యాకులతకి లోనైంది. డాక్టరుగా ఇంతకంటే పెద్దకేసులెన్నియంగా చేసినా, చూసినా ఈ అనుభవంవేరు. ఇదో కొత్త అనుభవం. తన కారుకిందే పడటం...ఇంతవరకూ తనకారుకింద మనుషులే కాదు ఒక్కజంతువు కూడా ఎప్పుడూ పడలేదయ్యే! అన్నీ కలిసి ఆయన మనసుని మెలిపెట్టాయి. లోకకి స్పృహరాగానే "మీ వాళ్లెవరున్నారమ్మా? మీ ఇల్లెక్కడ?" అంటూ ఆత్రుతగా అడిగారు రాజారావుగారు.

అదోరకంగా చూసింది లోక. అస్పష్టంగా గొణిగింది. 'ఎవరు? ఎవరున్నారు నాకు? ఎవ్వరూ లేరు' అంటూ పిచ్చిగా చూసింది. 'నీ పేరేమిటమ్మా?' అన్న డాక్టరుగారి ప్రశ్నకి కూడా జవాబు తెలియక 'ఏమో! నాకు తెలియదు. నాకేం తెలియదు' అంటూ పిచ్చిగా గొణిగింది.

'ఎవ్వరూ లేని ఒంటరి ఆడదని ప్రస్తుటికి నిశ్చయించుకున్నారు రాజారావుగారు.

లోక బాగా కోలుకున్నాక 'ఆ అమ్మాయిని నాతో మా ఊరు తీసి కెళతాను' అన్న ఆయన మాటలకి నవ్వారు మిగిలిన డాక్టర్లు.

'మీకెందుకండీ ఈ జంజాటమంతా! ఎవరో దారినపోయే...'

'కావచ్చు. మనిషి చూస్తే మంచి కుటుంబంలో మనిషిలాగే ఉంది. నా కారు కిందే పడటంతో నాకదోలా ఉంది. పైగా మతి భ్రమించింది. మెల్లిగా అన్ని విషయాలూ తెల్సుకున్నాక వాళ్ళ వాళ్ళకి అప్పగించే బాధ్యత కూడా నామీదే వేసుకుంటాను.' అన్న రాజారావుగారి మాటలు విని ఆయన ఎంతగా బాధపడుతున్నారో గ్రహించుకుని మరి మాట్లాడలేదెవరూ!

(ఇంకా ఉంది)



ఎం. కామేశ్వరరావు

# మాగ్నెట్

రాత్రంతా తన రెక్కలని దేశంమీద పరచి ఉంచిన చీకటి దేవత రెక్కలు విదుల్చుకని ఎగిరిపోయింది. ఈ పన్నెండు గంటల్లో లోకంలో ఏ అఘాయిత్యం జరిగి పోయిందో తెలుసుకోడానికన్నట్టు పైపైకి వస్తున్నాడు ఉదయ భాస్కరుడు. భాస్కరుడి ఆగడానికి మొహం ఎర్రచేసుకుంది. తూర్పాకాశం. తెరలుతెరలుగా దిగిన మంచు పొరలు పొరలుగా విడిపోతోంది. మంచు తెరలని ఛేదించుకొంటూ వీస్తున్న చిరు గాలి ఒంటిని కొరికి మరీ ముందుకు పోతోంది. ఎదురింటి వేపచెట్టుమీద కెక్కి ఎవరో కుర్రాడు వేపకొమ్మలు విరుస్తున్నాడు. దంతధావనానికి కాబోలు! చెట్టు మీద తనగూడు ఉందేమో, ఒక కాకి, 'కావు', 'కావు'మని అరుస్తూ ఆ కుర్రాడి తల చుట్టూ తిరుగుతోంది. అది తన్ను కుంటనే కుర్రాడు గబగబ క్రిందకి దిగి పోయాడు కొమ్మలు తీసుకుని.

గదిలోపడుకున్న నాకు కిటికీగుండా ఈ దృశ్యాలన్నీ కనిపిస్తున్నాయి. మెలకువ వచ్చినా లేవకుండా అలా పడుకునే కిటికీ లోంచి బయటకు చూస్తూ పావుగంట గడిపేయడం నా దినచర్యలో ఒకభాగం. ప్రతిరోజూ మా శ్రీమతి, 'లేవండి మహాశయా! మొహం కడుక్కున్నాక తీరిగ్గా కుర్చీవేసుకుని అన్నీ చూద్దురుగానీ! మళ్ళీ మళ్ళీ కాఫీ వెచ్చబెట్టడం నావల్లకాదు. మళ్ళీ తొమ్మిదింటికల్లా భోజనం కావాలానె!' అంటూ సుప్రభాతం మొదలు పెడుతుంది. నేను కాస్సేపు బెట్టుచేసి మరీ లేస్తాను. కానీ ఇప్పుడు మేలుకొలుపు పాడడానికి శ్రీమతి లేదు. వాళ్ళ స్నేహితురాలి పెళ్ళట, అమాయ జ్ఞావేసి, మళ్ళపెట్టి వారంక్రితమే పుట్టింటికి చెక్కేసింది. మూడు వారంనాకా ఊడిపడదు. ఏడుగా నన్ను రమ్మంటే, 'నాకు సెలవు దొరకదు. నేను రాను' అని ఖచ్చితంగా చెప్పేసాను. (మనలో మనమాట నెలక్రితం సంక్రాంతికి అల్లుడికీ కూతురికీ బట్టలుపెట్టిన మధ్యతరగతి మామగారు మళ్ళీ ఏం పెట్టగలరు? నా మొహం!)

ఇంట్లో బియ్యంలేవని జ్ఞాపకం రాగానే ఉన్న బద్ధకం కాస్తా ఎగిరిపోయింది. జీతం రాగానే ఏభైరూపాయలు శ్రీమతి చేతిలో పెట్టి పుట్టింటికి సాగనంపాను. చిల్లర కొట్టువాడికి, బొగ్గులవాడికి, పాలమనిషికి, ఇంటాయనకి నూటయాభై సమర్పించు కున్నాను. క్రితంనెల బియ్యం కొన్ని మిగిలాయి కాబట్టి బియ్యంకొందామని శ్రద్ధ పట్టలేదు. అనుకోకుండా మా ఆఫీసర్ గాడి (సారీ'గారి') కుమారరత్నం పెళ్ళి ఒకటి వచ్చిపడింది. ఉన్న యాభైలో ముఫై నైవేద్యంక్రింద సమర్పించు కున్నాను. (దేవుడికి సమర్పించుకుంటే ప్రసాదమైనా దక్కేది. ఇప్పుడు 'నువ్వు తెచ్చింది స్టీలు కంచమేనా?' అని మొహం

చిట్లించుకున్నాడు మా దేముడు) ఇరవైలో కరెంటు బిల్లుకి, కిరసనాయిలుకి, ట్రాన్సిస్టరులో బ్యాటరీ సెల్స్‌కి పదిహేను హుష్ కాకీ అయిపోయాయి. మిగిలిన ఐదూ బియ్యానికే పెట్టేస్తే కూరలకో? చిల్లర కొట్టువాడు ధరలు ఎక్కువేసేస్తున్నాడని బాకీ పరిష్కారంచేసేసి ఈనెలే వాడి పంజాలోంచి బయటపడ్డాను. అందుకే చచ్చినట్టు డబ్బిచ్చి బియ్యం కొనుక్కోవలసిన దురవస్థ పట్టింది.

'పేపర్' అనే కేకతోపాటు రాకెట్‌లా దూసుకువచ్చి మంచం మీదిపడింది పేపరు. అది ఇంటాయన తెప్పించే పేపరు. నేను మరొకటి తెప్పిస్తాను. ఇంటాయన వెనక భాగంలో ఉండటంతో పేపరు కుర్రాడు వాళ్ళ పేపర్నికూడా మా మోహానే గిరాటు వేసి వెళుతూ ఉంటాడు. రోజా ఆయన పేపరు ఆయన కివ్వడం నాకు డ్యూటీ క్రింద అయిపోయింది. యాంత్రికంగా కళ్ళు పేపరు మీద పరుగులు తీస్తున్నాయి. ఒక పేజీ అంతా ఆక్రమించుకుని ఉన్న 'రావోయి నారాజా!' 'నేడే చూడండి' అనే ప్రకటన నాదృష్టి నాకర్షించి 'అరే, ఇవాళేనా ఇది రిలీజయ్యేది!' నాలో నేనే సంభ్రమంగా అనుకున్నాను. ఆపిక్చర్ రిలీజు కోసం నేను కంట్లో కాయలు కాచేలా ఎదురుచూస్తున్నాను. (అలా అని నాకంట్లో కాయలకోసం వెతక్కండి) ఆ పిక్చర్‌లో నా అభిమాన హీరో, హీరోయిన్లు మొదటసారి కలిసివేస్తున్నారు. ఎందుకో ఆ పిక్చర్ రిలీజు చాలాసార్లు వాయిదాపడింది. నాకలలు పండించడానికి ఇవాళే వస్తోంది.

'కడుపులోకి లేదుగానీ, కళ్ళకి కావలసి వచ్చింది' ఎగతాళి చేసింది అంతరాత్మ.

'మరీ అంత తీసి పారేయకు. ఎక్కడయినా అప్పు పుట్టకపోదు' సర్ది చెప్పాను నేను.

'నీ మోహానికి నెలమధ్యలో ఎవరిస్తారు?'

'ఏం? నా మోహానికేం తక్కువ? ఇవ్వగలిగిన వాళ్ళే ఇస్తారు?'

'ఇంతకీ నీకు కావలసింది తిండి కా, సినిమా కా?'

'రెంటికీ' ఇంకా అలాగే కూర్చుని ఉంటే దీనికి ముగింపులేదని పేపరు తీసుకుని లేచాను. ఇంటాయన వాటావైపు వెళుతూ ఉంటే ఒక ఆలోచన వచ్చింది,

# మహా గ్రేట్

ఆయనకి సినిమాలంటే తెగపిచ్చి (నాకు లేదనికాదు) ఆయన చెవిలో ఈ శుభవార్త వేస్తే ఐస్సైపోయి అడగ్గానే పదో పదిహేనో సర్దవచ్చు.

'మీరు చూద్దామనుకుంటున్న మంచి సినిమా వచ్చింది' కుళాయిదగ్గర మొహం కడుక్కొని తుండుతో తుడుచుకుంటున్న ఇంటాయనతో 'మంచి' అనేమాటను నొక్కి పలుకుతూ అన్నాను. ఆయన సస్పెన్స్ భరించలేక 'ఏమిటి? ఏమిటి?' అంటూ ఆతృతగా అడుగుతాడని నాకు తెలుసు!

'ఇప్పుడు సినిమాలాగే ఉంది నా పని! తల్లీ కూతుళ్ళిద్దరూ మాట్లాడుకుని మరీ రెస్టు తీసుకున్నారు. ఈ మూడురోజులూ వంటిల్లే నాకు సినిమా హాలు' నా చేతిలో పేపరు తీసుకుని చికాగ్గా లోపలికి వెళ్ళిపోయాడు ఇంటాయన. ఆయన అవస్థకి జాలివేసింది. మరి నన్ను చూసి జాలిపడేదెవరు?

గబగబ మొహం కడిగేసుకుని, కాఫీ పెట్టుకోడానికి బద్ధకంవేసి, ఇంటికి తాళం పెట్టి సందుమొగలో ఉన్న హోటల్‌కి దారి తీశాను. రోడ్డు కటూ, ఇటూ రంగు రంగు బట్టల్లో, రకరకాల ఫోజుల్లో, 'రావోయి నారాజా' అంటూ నా అభిమాన హీరోయిన్ నన్నే పిలుస్తోంది.

'వచ్చేస్తున్నా, వచ్చేస్తున్నా' అని గొణుక్కుంటూ హోటల్‌లోకి అడుగు పెట్టాను.

'మీలాంటివాళ్ళు వస్తేనే కదండీ మాకూ కొంత...' మాట పూర్తిచేయకుండానే గ(ఫా)ర పళ్ళు బయటపెట్టి హీ, హీ అని గుర్రంలా సకిలించాడు మేనేజరు.

'నీ దరిద్రపుగొట్టు మొహమే చూసి రావాలి' మనసులో నా అభిమాన హీరోయిన్ మొహంతో వాడి మొహాన్ని పోల్చుకుని అసహ్యించుకున్నాను; (మగవాణ్ణి హీరోయిన్ మొహంతో పోల్చడం ఏమిటా అని మీకు సందేహం రావచ్చు. అప్పుడు నా మదిలో నా హీరోయినే ఉండటంచేత ఆమెతోనే పోల్చుకున్నాను. ఈ మాట మా శ్రీమతి దగ్గరనేరు, జాగ్రత్త!!)

పాంబారుతోసహా రెండిడ్లీలు లాగించేసి కషాయంలాంటి కాఫీ గుటగుటా తాగేసి మళ్ళీ బయటకువచ్చి పడ్డాను. (బిల్లు చెల్లించేలెండి!) మళ్ళీ అనేక ఫోజుల్లో 'రావోయి నా రాజా!' అంటూ దీనంగా అడుగుతోంది నా హీరోయిన్ (అభిమాన) ఇక చూడలేక కళ్ళు మూసేసుకున్నా 'సాయంత్రం ఆరు కొట్టగానే వచ్చేస్తాను దేవీ' అని మనసులోనే అనుకున్నా గబగబ ఇంటికి వచ్చేశాను.

'వాగ్దానం అయితే చేసేసావుగాని ఎలా వెళతావు?' అనుమానం వెలిబుచ్చింది అంతరాత్మ.

'నువ్వు నోరు మూసుకో! నా కన్నీ తెలుసు. ఎలాగో ఒకలా వెళతాను' చిరాగ్గా కసిరి, బరబరా గడ్డం గీయడం మొదలు పెట్టాను. కళ్ళముందు దీన వదనంతో, ఎగురుతోన్న జుట్టుతో, చేతులు రెండూ ముందుకుచాచి, 'రావోయి నా రాజా!' అంటూన్న హీరోయిన్ కదలాడింది. ఖస్సుమని తెగింది బ్లేడు; గాయాన్నికూడా లెక్క చేయకుండా నున్నగా గీసేశాను గడ్డాన్ని!'

'ఇవాళ ఆదివారమే! అందరూ ఇంటి దగ్గరే ఉంటారు. ఎవరో ఒకళ్ళు అడిగితే సర్దకపోరు' బాత్‌రూమ్‌లో పనిమనిషి కాచి పెట్టిన నీళ్ళు వంటిమీద పోసుకుంటూ తృప్తిగా అనుకున్నాను.

నీట్‌గా టాయిలెట్ అయి ఇంటికి తాళంవేసి రోడ్డుమీదకు వచ్చాను. ఎండ మెల్లగా ఎక్కబడుతోంది. ఎవరో తరుముకు వస్తున్నట్టు హడావిడిగా అటూ ఇటూ సైకిళ్ళమీద, రిక్షాలలో, కార్లమీద జారుకుంటున్నారు జనం. ఆదివారం కాబట్టి స్కూలు పిల్లలు యూనిఫారాలలో కనబడటం లేదు. 'ఎక్కడికి వెళ్ళాలి?' మొదటిసారిగా ప్రశ్నించుకున్నాను.

'చంద్రం దగ్గిరకెళితే? వెళ్ళవచ్చు; కానీ చాలాదూరం. ఎక్కడా దొరక్కపోతే వెళ్ళవచ్చు. రాజునడిగితే? వాడు మొన్ననే ఆఫీసులో ఎవర్నో అడుగుతూ కనబడ్డాడయె. పోనీ వెంకటావు నడిగితే? 'మతిమరుపు కాకపోతే వెంకటావు మొన్ననే నాల్రోజులు సెలవుపెట్టి తిరపతి కెళ్ళాడు. మరి ఎవరిదగ్గిర కెళ్ళాలి చెప్మా? సందు చివర ఉన్న ఉమాపతి సంగతో? వాడి మొహం, నలుగురు పిల్లలున్నవాడు నాకేమి

(34వ పేజీ చూడండి)



...యమున వెంకటదేవి, గుంటూరు.

నా ముఖముమీద, చేతులమీద వెంట్రుకలు వస్తున్నవి. పసుపు రాసుకొన్నా పోవుటలేదు.

* ఆడవారిలో వెంట్రుకలు ఎక్కువగా రావటం 'హార్మోనులు' ఎక్కువ తక్కువలు అవటంవలన జరుగుతుంది.

ఆడవారిలో సహజంగా 'ఈస్ట్రోజెన్లు' మగవారిలో 'ఆండ్రోజన్లు'—అనే హార్మోనులు ఎక్కువగా వుంటాయి' అయితే ఈ రెండూ కూడా ఇద్దరిలోనూ వుంటాయి. ఈ 'బాలెన్స్' ఏకారణాల చేతనైనా తప్పినప్పుడు మగవారికి ఆడలక్షణాలు, ఆడవారికి మగలక్షణాలు కనబడ వచ్చును.

హార్మోనులు ఉత్పత్తి పెరగటం, లివరు దెబ్బతినటం మూత్రపిండములు సరిగా పనిచేయక పోవటం ఇలా జరగటానికి కొన్ని కారణాలు. 'నెత్తురు పరీక్ష మొదలగు నవి చేయించుకొని డాక్టర్ల సలహాపై హార్మోనులు వాడితే తగ్గిపోతాయి.

కె. ఎస్. బి. వి. ఎస్, ఎస్. రావు—భీమవరం.

నా వయస్సు 19 సం. లు. నాకు ఊహ తెలిసినప్పటినుంచీ మలవిసర్జన క్రమబద్ధంగా అయ్యేదికాదు. ప్రస్తుతం మలం క్రమంగానే వెళుతున్నా, రోజుకి 4 సార్లైనా వెళ్ళాల్సి వస్తోంది, వచ్చినప్పుడు ఒకనిమిషం కూడా ఆపుకోలేను.

* ఈ రకమైన లక్షణాలు వున్నప్పుడు 'ఇన్‌టస్టైనల్ హర్రీ' అంటే ప్రేగులు తొందరగా కదులుతున్నవి అని అర్థము' ప్రేవులలో, నరముల చివర్లు - మ్యూకస్ పొరలలో వుంటాయి. ఈ ప్రేవులు—ఆహారంతో (లేక మలంతో) నిండినప్పుడు ఈ నరాలు పనిచేసి వెంటనే కండరములను ముకుళింప చేయటంవల్ల ఆహారం (లేక మలం), క్రింది భాగానికి పోవటమే 'పెరిస్టాల్సిస్' అంటారు. ఈక్రియ అతి తొందరగా జరిగినప్పుడు ఈ లక్షణాలు ఏర్పడతాయి.

మీరు బరాల్గాన్ మాత్రలు, ఆహారానికి అరగంటముందు అర మాత్ర చొప్పున వాడండి. 'న్యూరోట్రిసంటిన్' అనే మాత్రలు రోజుకి రెండు చొప్పున వాడటం వల్ల గుణం కనబడుతుంది.

బి. కరుణమ్మ—గుంతకల్లు.

నా వయస్సు—41 సం లు. 10 సం.ల నుండి గుండెనొప్పి వస్తున్నది. వచ్చినప్పుడు నాలుగు రోజుల వరకూ బరువుగా వుంటుంది. నెప్పి వున్నప్పుడు చిన్నశబ్దంకూడా ఓర్చుకోలేను. బలహీనము—ఇంకా ఏమీ లేదన్నారు.

* మీరు కొన్ని పరిక్షలు చేయించుకోవాలి. ముఖ్యంగా, కడుపులోని గ్యాస్ట్రిక్ జ్యూస్ (ఎఫ్. టి ఎమ్.), ఎక్స్‌రే (ఛాతీ), మూత్రపరీక్ష (షుగర్), నెత్తురుపరీక్ష (షుగర్ — కొలెస్ట్రాల్) చేయించటం అవసరం. ఇ. సి. జి. నెప్పి వచ్చినప్పుడు తీయించుకోవాలి.

ఈ పరీక్షల ఫలితాలనుబట్టి వైద్య క్రమం నిర్ణయించాలి, పైన చెప్పిన లక్షణాలనుబట్టి వైద్యం నిర్ణయించటం కష్టం

జి. పద్మ, సికింద్రాబాద్.

మా బాబుకి 6 నెలలు వయస్సు. నెల వెళ్ళినప్పటినుండీ జ్వరం వస్తోంది. వైద్యులకి చూపించగా న్యుమోనియా వున్నదని మందులిచ్చారు తగ్గలేదు. దగ్గు కూడా వున్నది. జ్వరం 100 కి తగ్గలేదు.

* మీ బాబుకి తక్షణం 'మాంటో టెస్ట్' చేయించండి. దాని ఫలితం ప్రకారం స్ట్రెప్టోమైసిన్ ¼ గ్రాము ప్రతిరోజూ 15 రోజులపాటు, తర్వాత వారానికి రెండు సార్లు మాత్రమే రెండునెలలపాటు ఇప్పించాలి. ఇదేసమయములో ఐసోనెక్స్ మాత్రలు 100 మిల్లీగ్రాములు రోజుకి ఒకసారిగా ఆరునెలలు వాడాలి

వైద్యం ఆరునెలలపాటువున్నా, మొదటి 5 ఇంజక్షన్ల తర్వాత గుణం కనబడుతుంది. వైద్యం చేయించాల్సిన కాలాన్ని చూసి భయపడకూడదు.

కె. రమాదేవి, తరటావ (భీమవరం)

మా అన్నయ్యగారి పాపకు పోలియో డ్రాప్స్‌వేసినా పోలియోవచ్చి కాలు వంకర పోయింది. బూటువేస్తున్నారు. డ్రాప్స్ వేసినా పోలియో ఎందుకు వచ్చింది?

* పోలియోడ్రాప్స్ క్రమబద్ధంగా వేస్తే పోలియోరావటం అరుదు ఒకవేళ పోలియో వచ్చినా కాళ్ళు వంకరబోయి - బూట్లు వెయ్యటం—ఇంకా అరుదు.

ఒకవేళ నిజంగా అది పోలియో అయి వుంటే—డ్రాప్స్ వెయ్యకముందే పోలియో క్రిములు శరీరంలో ప్రవేశించి వుండాలి. ఎందుకంటే క్రిములు ప్రవేశించటానికి, రోగలక్షణాలు కనబడటానికి చాలా వ్యవధి వున్నది.

మరీ అరుదుగా, పోలియో వాక్సిన్ సరిగా 'స్టోర్' చెయ్యకపోవటంవల్ల, వాక్సిన్ తయారీలో అవకతవకలు వచ్చినప్పుడు పోలియోడ్రాప్స్‌వలననే పోలియో రావచ్చును.

ఎ. నాగేశ్వరరావు, టాటానగర్.

నాకు ఎక్కువ కఫం తెల్లరంగులో వస్తుంది, తరచూ నోటిపుండు వస్తుంది. వీటికి నివారణోపాయాలు తెలియజేయండి.

* తరచూ కఫం రావటం, వూపిరితిత్తులలో, 'బ్రాంకి ఎక్టేసిస్‌వల్ల' అయి వుండవచ్చును. వూపిరితిత్తులను X రే తీయించి, నెత్తురు పరీక్ష ఫలితాలను వైద్యులకు చూపించండి.

నోటిపూతరావటం, 'బి' కాంప్లెక్స్ విటమినుల లోపంవల్ల అయివుండవచ్చును.

రిబోఫ్లావిన్‌మాత్రలు, 'బి' కాంప్లెక్స్ ఇంజక్షన్లతోబాటుగా, ఎక్కువ ఆకుకూరలు, కామంచి ఆకురసం, సగ్గుబియ్యంజావ, కొబ్బరిపాలు, దంపుడు బియ్యపు అన్నం తీసుకొంటే నిరంతరంగా తగ్గిపోతుంది. ●




మండిగొండ శివప్రసాద్

✷ రాధారాణి చాలా అందగత్తె అని ఈ నాడెవరూ ప్రత్యేకంగా చెప్పవలసిన పనిలేదు. అందానికి రాధ పర్యాయ పదంగా మారి చాలా కాలమైంది, ఎవరైనా అందగత్తెలను పోల్చాలంటే 'అబ్బ ఆమె అచ్చం రాధారాణిలా వుంది' అనే ఉపమావస్థాయికి వెళ్లింది రాధారాణి సౌందర్యం సమాజంలో! !

అందుకనే వెంకటసుబ్బయ్యకు కృష్ణరావును చూస్తే మంట! అసూయ! ఏదో తెలియని బాధ! భార్య అందంగా వుండటమన్నదీ ఒకానొక పూర్వజన్మ సుకృతమేనని వెంకటసుబ్బయ్య విశ్వాసం. కృష్ణరావు ఏ పార్టీకి వచ్చినా రాధారాణిని వెంట తీసుకొని వస్తాడు—ఏ సభలకూ సమావేశాలకూ వెళ్లినా రాధ వెంట వుంటుంది. అసలా సభలకు రాధే ఓ అందం ! షిఫాన్ సిల్కుచీరె కుచ్చెళ్లు అలా జార్చుకొని వెలుగుతున్న ట్యూబ్ లైటులా రాధారాణి అలా నడుస్తూంటే సభ మొత్తం చిత్తైపోతుంది. ఏ క్లియోపాత్రానో, మాచల్దేవినో చూచినట్లు చూచి చూచి తన్మయం చెందిపోతుంది.

వెంకట సుబ్బయ్యకు ఆ అదృష్టంలేదు. కామాక్షి ఎన్నిక విషయంలో తాను తొందరపడ్డాడని రాధారాణిని చూచినప్పుడల్లా అనుకుంటుంటాడు సుబ్బయ్య. చూడనప్పుడూ అనుకొంటూంటాడు రాధారాణిని గుర్తుకు తెచ్చుకోని. 'యుద్ధరంగంలో ఒక్క పొరపాటు చేస్తే అపజయం తప్పదు. భార్య ఎన్నిక విషయంలో ఒక్కసారి పొరపాటు చేస్తే దాని ప్రతిఫలాలను అనుభవించక తప్పదు' అని మెడిల్టన్ మహాశయుడు చెప్పిన ఓ సూక్తిని తన డైరీలో ముందుపుటలో వ్రాసి పెట్టుకున్నాడు వెంకటసుబ్బయ్య. ప్రతిరోజూ డైరీ తెరిచి, గీతాశ్లోకంలా ఆ సూక్తిని ఓసారి పారాయణ చేసి తన దురదృష్టాన్ని తానే నింది చుకొని రాధారాణిని ఒక్కసారి స్మరించు కొంటాడు వెంకటసుబ్బయ్య.

వెంకటసుబ్బయ్య కామాక్షిని పూర్తిగా ఇష్టపడే చేసుకున్నాడని చెప్ప

లేము పెంచి పెద్దచేసి విద్యాబుద్ధులు చెప్పించిన మామ కన్నుమూస్తూ కూతురును చేసుకోమని చేతిలో చెయ్యి వేయించుకుంటే మామమీది కృతజ్ఞతతో కామాక్షిని చేసు కున్నాడు సుబ్బయ్య. ఆనీనాడు ఇంట్లో విస్తరి వెయ్యగలుగుతున్నాడూ అంటే అందుకు మామగారి చేయూతే కారణం. నిజానికి కామాక్షి అందవికారి ఏమీ కాదు. కాని కామాక్షిమీద ఇష్టమే తన వివాహానికి కారణం కాదుగా. మామపై కృతజ్ఞతతో మామకూతురితో జీవించాలి తాను, కాని కృష్ణారావు అట్లా కాదే! అదీ వెంకట సుబ్బయ్య బాధ! !

'సుబ్బయ్యా రేపు సకుటుంబంగా మా ఇంటికోసారి రాగాదూ' అని కృష్ణారావు తన్ను చాలాసార్లు పిలిచాడు. కాని కామాక్షిని వెంటబెట్టుకొని షికారు కెళ్ళడం తన కెందుకో సిగ్గు. అసలు కామాక్షి వస్తానంటే కదా తీసుకెళ్ళడానికి పల్లెటూరి పాతచింత కాయ మొఖం — దీనికి నవ నాగరికత బొత్తిగా తెలీదు' అని చాలాసార్లు అను కున్నాడు వెంకటసుబ్బయ్య.

'ఏమైతే అదైంది' అని సాహసించి ఒక్కసారి కృష్ణారావు ఇంటికి వెళ్ళాడు సుబ్బయ్య కామాక్షిని తీసుకొని ఈ వెళ్ళడంలో ముఖ్యంగా రెండు ప్రయోజనా లున్నాయి. తన కెందుకో కృష్ణారావు ఇంటినీ రాధారాణినీ, చూడాలనిపించింది మొగటిది ఇక రెండవది కామాక్షికి ఇలా ఒకటి రెండుసార్లన్నా ఈ సౌందర్య వంటి వాళ్ళను చూపిస్తే కొంత సంస్కారం నేర్చుకుంటుందేమోనని ఓ ఆశ !!

వెళ్ళగానే రాధారాణి అతిథుల నిద్దరినీ ఎంతో ఆదరంగా ఆహ్వానించింది.

కుషన్ కుర్చీలల్లో కూర్చోబెట్టి ఇన్ స్టాంట్ కాఫీ కలిపించి ఇప్పించి, చిలక పిట్టలా కూర్చోని కబుర్లు చెప్పడం మొదలు పెట్టింది—

కామాక్షి సిగ్గుగా తలవంచుకొని కూర్చున్నది

రాధారాణి, కౌలాలంపూర్‌లో రామనాథన్ కృష్ణన్ ప్రదర్శించిన ప్రతిభగూర్చీ, బొంబాయి టెస్ట్‌మాచ్‌లో పటౌడీ నవాబ్ నైపుణ్యం గూర్చి సోదాహరణంగా చెపు తున్నది—

నిజానికి కామాక్షికి టెన్నిస్, క్రికెట్ రెండూ కొత్తే!!

రాధారాణి ఇంటిని కూడా తన లాగే అలంకరించింది. ఎక్కడ చూచినా పూల కుండీలు — ఏలకు లాక్కులలో చేసిన కుందేళ్ల బొమ్మలూ, గుండెలో అల్లిన హంసల పటాలూ, రాధా మాధవుల శృంగార చిత్రాలూ, ఖజురహో శిల్పం మోడల్సూ!!

'ఇప్పుడే వస్తాను' పాన్‌దాన్ పెట్టె కోసంలోపలికి వెళ్ళింది రాధారాణి—

సిగరెట్లు తెచ్చి ఇద్దామని గదిలోకి వెళ్ళాడు కృష్ణారావు.

'మొద్దు మొగమా! ఆమె అలా మాట్లాడుతుంటే ముంగిలా కూర్చుంటా వేం! కనీసం ఒక్కమాటన్నా మాట్లాడు—' మెల్లగా అదిలించాడు వెంకట సుబ్బయ్య కామాక్షిని

'సరే' నన్నట్లు భర్త వైపు చూచింది భయంగా కామాక్షి.

రాధారాణి వచ్చింది ఆకులూ సెంటెడ్ చున్నం, తీసుకొని.

'ఈ ఇంటికే మీరెంత అద్దె ఇస్తున్నారు' కామాక్షి అడిగింది.

'రెండు వందలయాభై' కొంచెం గర్వంగా జవాబు చెప్పింది రాధారాణి.

'కానీ పెద్ద సౌకర్యంగా వున్నట్లు తోచదు. కిటికీలు చూడండి ఒక దాని కెదురుగా ఒకటి బాగా గాలి వచ్చేటట్లు కట్టలేదు ఎందుకనో—'

రాధారాణి అదోలా ముఖం పెట్టింది—

'మీకు పాలు ఎవరు తెచ్చి ఇస్తారు' కామాక్షి ప్రశ్నించింది.

'నౌకరు'

'నిన్న బొత్తిగా ఇబ్బంది అయిపోయిం దండీ మాకు—సీసాలు రావడమే తక్కువ వచ్చాయట—మావారు క్యూలో గంటసేపు నిలబడ్డా లేవు పొమ్మని పంపించేశారు'

రాధారాణి చిరునవ్వు నవ్వింది—

వెంకటసుబ్బయ్య కెందుకో తల కొట్టేసి నట్లు అనిపించింది

'మీరు పనిమనిషి కెంత ఇస్తారు?'

'అన్నంపెట్టి ఇరవైరూపాయలు'

'మా పనిమనిషి మంచిది సుమండీ! పొద్దునా సాయంత్రం పనిచేసి పోతోంది. అంట్లు పరిశుభ్రంగా తోముతుంది. అడగ కుండానే శుక్రవారం, మంగళవారం ఇల్లు కడిగి పోతుంది—అన్నం మిగిలితే పెడతాము లేకుంటే లేదు—మేమిచ్చేది పన్నెండు రూపాయలే'

రాధారాణి కొంచెం చికాకుపడ్డట్లు ఆమె నేత్రాలు విచిత్రంగా నర్తించాయి

వెంకటసుబ్బయ్య అదీ గ్రహించాడు.

సంభాషణ మార్చేందుకని 'ఈ మధ్య ఏదైనా సినిమా కెళ్లారా' అన్నాడు కృష్ణా రావుతో

'ఆ—మొన్న హిచ్‌కాక్ పిక్చర్ ఒకటి వస్తేను వెళ్లాము—' అన్నది రాధారాణి

మీరు వెళ్ళలేదా' అన్నాదు కృష్ణారావు—

'ఏదండీ తీరిక దొరకందే' అన్నాడు వెంకట సుబ్బయ్య.

'ఈ న్యూవేవ్ పిక్చర్స్ గూర్చి మీ అభిప్రాయమేమిటి' ప్రశ్నించింది రాధారాణి కామాక్షిని—

'అవేమిటో నాకు తెలీదు' స్పష్టంగా జవాబిచ్చింది కామాక్షి

'మీ లాంటి సినిమాలు చూస్తా రయితే'

'ఏవో మంచి తెలుగు సినిమాలు—సీతా రామ కల్యాణం లవకుశ, లాంటివి'

రాధారాణి నవ్వింది! !

ఆ నవ్వునుండి హేళన తుంపురులు తుంపురులుగా రాలుతున్నది—

'ఇక లే, పోదాము' అన్నాడు సుబ్బయ్య భార్యను.

'వస్తానండీ' నమస్కరించి లేచింది కామాక్షి.

విష్ చేసింది రాధారాణి —

సుబ్బయ్యా కామాక్షి బయటకు వచ్చారు—

ఛీ! రాధారాణి ఏమనుకుంటుందో తన భార్యను గూర్చి!

బొత్తిగా మానర్స్ కూడా తెలియని జంగ్లీ అనుకుంటుందా?

రిక్షాలో ఎక్కాక కామాక్షి అన్నది 'అదేం మర్యాదండీ ఆమెది—వెళ్తున్నానంటే బొట్టన్నా పెట్టకుండా టా టా—చెపు తుంది' అన్నది బుగ్గలు నొక్కుకుంటూ.

'వాల్లే—నోరుమూసుకో' విసుక్కున్నాడు సుబ్బయ్య.

భర్తకెందుకు కోపం వచ్చిందో, తన ప్రవర్తనలో ఏది లోపంగా కనపడ్డదో మటుకు కామాక్షికి అర్థం కాకపోయినా సుబ్బయ్యమాట ప్రకారం నోరుమూసు

కున్నది ఇంటికి పోయేవరకూ—

ఛీ! దీన్ని ఎవరి ఇంటికీ తీసుకెళ్ల కూడదు అనుకున్నాడు సుబ్బయ్య—

మరి సభ్యత వచ్చేదెలా? ?

ఇళ్ళకు కాకపోయినా ఏవైనా సభలకూ వాటికి తీసుకుపోతే బాగునడదూ—

రేపు కళాభవన్ చిత్ర ప్రదర్శనానికి తీసుకెళ్తే ! !

ఔను! అంతే! !

ఈ అనుకున్నదాన్ని అమలుపెట్టాడు సుబ్బయ్య వెంటనే

కళా భవన్‌లో మోడరన్ ఆర్ట్ ప్రదర్శనం ప్రారంభమైంది—

అంతా వేయి నోళ్ల బొమ్మలను పొగుడుతూ పోతున్నారు ప్రేక్షకులు.

కామాక్షి వైపు చూచాడు సుబ్బయ్య ఉత్సాహంగా—

ఆమె ఏదో అయోమయంగా చూస్తున్నది బొమ్మల్ని—

'బాగున్నాయికదూ కామాక్షీ బొమ్మలు'

'నిజం చెప్పాలంటే నాకివేమిటో అసలు అర్థమే కాలేదండీ'

'వెర్రిమొగమా కాస్త బ్రైన్ ఉపయోగించి ఆలోచించు'

'ఎంత తమ్ముకుచచ్చినా ఆ రంగులేమిటో గీతలేమిటో నాకు బోధపడటం లేదండీ—'

## సౌందర్య

దీనికింద 'అర్ధరాత్రి సూర్యుడు' అని తెలుగులో వ్రాశారు—పైన ఏదో చెట్టు బొమ్మ వుంది ఈ చెట్టుకూ అర్ధరాత్రి సూర్యుడికీ ఏమిటి సంబంధం ? అసలు సూర్యుడు అర్ధరాత్రి రావడమేమిటి ?'

'మూర్ఖురాలా ! అదంతా సింబాలిజం—మిస్టిసిజం—ఫ్రెంచ్ ఆర్ట్—' కోపంతో ఎవరూ వినకుండా మందలించాడు కామాక్షిని సుబ్బయ్య—

'అదేమో నాకు తెలియదు సుమండీ—ఆబొమ్మ చూడండీ—అసహ్యంగా—రొమ్ములు ఎలా పైకి కన్పడేటట్లు నగ్నంగా గీచాడో కళాకారుడు—నా చిన్నతనంలో రవివర్మ బొమ్మలు చూడలేదూ—అందులో ఇలా కండలూ చర్మమూ ప్రదర్శించేవాడా ? బొమ్మలంటే ఏమిటండీ — ఆ బొమ్మ యొక్క ఆత్మ సౌందర్యం కన్పడవద్దూ?'

సుబ్బయ్య నివ్వెరపోయాడు భార్య మాటలకు—

భార్య తనకు తెలియకుండానే మహాకళా సిద్ధాంతాన్ని ప్రవచించింది పాశ్చాత్య చిత్రకళలో భౌతికమైన చర్మమూ మాంసమూ ఎక్కువగా ప్రదర్శింప బడుతాయి—ఎక్స్‌ప్రెషన్ ఎక్కువగా వుంటుంది—భారతీయ కళాదర్శనంలో చర్మానికికాక హృదయానికీ ఆత్మకూ ప్రాధాన్యాన్ని ఇచ్చి రచిస్తాడు చిత్రకారుడు.

బొమ్మలు నగ్నంగా ఉద్రేకాలను రెచ్చగొట్టేటట్లుకాక, ఏదో ఉపనిషత్ సందేశాన్ని చిరునవ్వులతో చాటి చెపుతున్నట్లుంటాయి.

కామాక్షికి ఈ కళావిమర్శనం తెలియదు—

కాని ఆమె చెప్పినది ప్రత్యక్షర సత్యమే!

'ఫరవాలేదు—నా భార్యకూడా కాస్త తెలివైందే' ననుకున్నాడు మొట్టమొదటిసారిగా సుబ్బయ్య !

ఇంటికి బయలుదేరారు ఇద్దరూ—

'మీకు సిగ్గులేకపోతే పోయింది నన్ను మాత్రం వెంటబెట్టుకొని ఇలా గుడ్డల్లేని బొమ్మలుచూచేందుకు మీ జన్మలో బయలుదేరకండి' అన్నది కామాక్షి కోపంగా—

'నీకీజన్మలో సంస్కారం అబ్బదు కామాక్షీ—నా కృషి మొత్తం ఎలుకతోలు తెచ్చి ఉతికినట్లే అవుతున్నది' అన్నాడు సుబ్బయ్య బాధగా !

కృష్ణారావు రేపిస్తానని మూడువందలు చేబదులు తీసుకున్నాడు. వారంరోజులైంది—తీర్చలేదు.

అడిగితే ఎలా వుంటుందో—అడగకపోతే తనకు కటకటగావుంది.

'సరే'నని సాహసించి వెళ్లాడు వెంకట సుబ్బయ్య.

తాను వెళ్లేసరికి రాధాకృష్ణులు ఏదో తీవ్రంగా వాదించు కుంటున్నారు.

సుబ్బయ్యను చూచి ఇంగ్లీషులో అన్నది రాధారాణి 'హల్లో మిస్టర్ సుబ్బయ్యా కమిన్—మీరు చెప్పండి ఈ పెద్దమనిషికి—అందం దేవుడిచ్చిన వరమంటారా, కాదంటారా ?'

'ఔనౌను వరమే' నంటూ ఓ కుర్చీలాక్కొని కూర్చున్నాడు సుబ్బయ్య.

'దానిని నిత్యనూతనంగా పోషించుకోడం మన కర్తవ్యమా కాదా ?' రాధారాణి సూటిగా ప్రశ్నించింది

'అవును కర్తవ్యమే ! జాన్ రస్కిన్ అందుకే అన్నాడొక సందర్భంలో— 'స్త్రీకి ప్రకృతి ఇచ్చిన తొలి బహుమానం సౌందర్యం—ముందుగా తీసేసుకునేదీ దానినే' అని—



'ఆఁ— అలా మా ఆయనకు గడ్డి పెడు మరూ ఆ రస్కిన్ సూక్తిని అర్థ తాత్పర్యాలతో వివరించి — లోకంలో అందరూ పిల్లలను కనేందుకే పుట్టరు వెంకట సుబ్బయ్యగారూ—కొందరు సౌందర్య వతులుగా పుడతారు — సౌందర్యవతులుగానే ధ్రువతారలౌతారు...మేము వో అందమైన పిల్లనో పిల్లవాణ్ణో పెంచుకోవాలని నిశ్చయించుకున్నాము సుబ్బయ్యగారూ-'

'బాగుంది...బాగుంది'

కృష్ణారావు నిట్టూరుస్తూ లేచి 'సుబ్బయ్యా ! ఒక్కమాట' అని గుమ్మం ఇవతలకి పిలుచుకు వచ్చాడు.

'సారీ — మరేమీ అనుకోకు – రెండు రోజుల్లో సైకం వర్దేస్తాను సుబ్బయ్యా'

'అబ్బే ! నేనసలు అందుకు రాలేదు కృష్ణా'

'పోనీలే—మవ్వెందుకు వచ్చినా చెప్పడం నా ధర్మంకదా !...' అని ఒక్కక్షణం ఆగి అన్నాడు.

'నాకీవిడ సౌందర్యోపాసనతో పిచ్చెక్కిపోతున్నది—ఎంతడబ్బూ చాలక, ఏ ఆత్మహత్యో చేసుకోవాలని పిస్తున్నదీ'

సుబ్బయ్య గారి స్తంభించినప్పుడు అల్లల్లాడని ఆకులా నిలబడ్డాడు ఊపిరి బిగించి.

'సుబ్బయ్యా ! స్త్రీలందరూ భార్యలు కాలేరయ్యా ! కొందరు గాజు బొమ్మల్లాంటి వ్యక్తులు అద్దాల బీరువాలల్లోనో మ్యూజియాలలోనూ ప్రదర్శింపదగ్గట్టూ, అలంకరింప దగ్గట్లూ వుంటారు—సంసార కూపానికి అతీతంగా వుండే ఈ అపురూపమైన పంకజాలను ఆదర్శంగా చూడాలే కాని వాస్తవ లోకంలో తాకాలని ప్రయత్నించామో నిప్పు నంటుకున్నట్లే ననుకో.'

సుబ్బయ్యకు ఏం జవాబు చెప్పాలో తెలియక వెర్రిముఖం వేశాడు—

సుబ్బయ్యా—మా గొడవలు ఎప్పుడూ వుండేవే ఏమీ అనుకోకు. రేపో ఎల్లుండో నేనే మీ ఇంటికి తెచ్చిస్తాను సైకం—'

'ఫరవాలేదు కృష్ణా ! నువ్వలా బాధ పడితే నేనసలు తీసుకోనే తీసుకోను తెలుసా ?'

అంతకంటే, ఇంకేమనాలో తెలియక సుబ్బయ్య రోడ్డుమీద పడ్డాడు—

నుదుట పట్టిన చెమటను చేతిగుడ్డతో గట్టిగా తుడుచుకొని రెండు ఊపిరి తిత్తుల నిండా గాలిపీల్చుకొని కామాక్షి అందాన్ని కళ్లనిండా భావనతో నింపుకొని సైకిల్‌ను ఇంటిముఖం పట్టించాడు వెంకట సుబ్బయ్య !! ●

# సిమీ బ్యూటీ బులెటిన్

లేక

## అందానికి చిట్కాలు

అందాల తార సిమీ అందానికి, ఫాషన్‌కి తగిన చిట్కాలు తెలుపుతుంది వ్యక్తిగత మయిన ప్రశ్నలకి సమాధానాలు ఇవ్వలేనని తెలుపటానికి ఆమె చింతిస్తోంది! సాధారణంగా అందరికీ ఉపయోగంగా ఉండే ప్రశ్నలనే 'SIMI'S BEAUTY BULI[TT]IN, Post Bag No 7117, BOMBAY 400014 కి పంపవచ్చు.



ప్ర: నేను చాలా బరువెక్కిపోతున్నాను. నా భర్తకికూడా ఇది ఇష్టంలేదు. వేళా కోళం చేస్తున్నారు. తప్పించుకునే అవకాశం వుందా ?

జ: మీ భర్త మిమ్మల్ని ఉడికించకుండా వుండాలంటే మీరు కాస్త కష్టపడవలసి వస్తుంది మరి! లావెక్కించే పదార్థాలు ఏమీ తినవద్దు. చాక్‌లెట్లు, కేక్స్, బంగాళా దుంపలు, వరి అన్నం—ఇవన్నీ తినడం తగ్గించండి, ఆకుకూరలు, కూరగాయలు, తాజాపళ్ళు తినండి. వంగి, బొటనవేలిని తాకడం, వెనక్కి విరగబడటం లాంటి వ్యాయామం రోజూ ప్రొద్దున్నే చేస్తూ వుండండి. ఈత ఈదటం, బాడ్‌మింటన్ ఆడటంవల్లకూడా మీ బరువు తగ్గిపోతుంది.

ప్ర: బ్లీచింగ్ పవుడర్, కొద్దిచుక్కలు అమ్మోనియా, మరికొంత హైడ్రోజన్ పెరాక్సైడ్‌వల్ల శరీరంలో నలుపు విరుగుతుందా? ఇది వారానికి ఒకసారి చేస్తూ వుండవచ్చా?

జ: బ్లీచింగ్‌వల్ల నలుపురంగు మారి తెల్లగా అవటానికి అవకాశంవుంది. కాని అది తాత్కాలికం. మళ్లీ కొద్దిరోజుల్లో నల్లబడిపోతుంది. అదేపనిగా బ్లీచింగ్‌చేస్తూ వుండటంవల్ల నష్టం వుంది. ఏ అపాయం కలగకుండా వుండాలంటే నెలకోసారి ఈ పద్ధతి అవలంబిస్తూవుండాలి ●

# సంపూర్ణమైన నోటి రక్షణ

CIBA



ఒక్క బినాకా టాప్ మాత్రమే మీకు సంపూర్ణమైన నోటి రక్షణ నిస్తుంది. ఎందుచేతనంటే బినాకా టాప్‌లో మాత్రమే మీ నోటిలో అన్ని మూలలకు చొచ్చుకొని పోగల ఒక ప్రత్యేక పదార్థమున్నది. దంతక్షయ కారకములైన సూక్ష్మ జీవులను నిర్మూలిస్తుంది. దుర్వాసనను తొలగిస్తుంది. సంపూర్ణమైన నోటిరక్షణ తప్ప మరొక దానికి ఒప్పుకోకండి.

**మీకు మీరుగా చూడగల నిదర్శనం ఇదిగో! ఈ లేబొరేటరీ ప్రయోగాన్ని మీ ఇంటిలోనే ప్రయత్నించండి, నేడే!**



ఒక గాజు గిన్నెను తీసుకుని అందులో నీరు పోయండి. ఆ నీటిలో పొడి చేసిన బొగ్గు లేక రంగు పొడరును చిలకరించండి.



బినాకా టాప్‌ను కొంచము నీటిలో కలిపి ఈ ద్రావకము యొక్క ఒక బొట్టును గాజు గిన్నె మధ్యలో వెయ్యండి.



మీ మటుకు మీరే చూడండి, ఎంత వేగంగా బినాకా టాప్ అన్ని వైపులకు వ్యాపిస్తుందో ...మలినమును విడగొట్టి, స్వచ్ఛమైన, తేటమైన ఉపరితలాన్ని కల్పిస్తుందో.




# బినాకా® టాప్

గుండ్రని కుంచె-చివళ్ళు కల్గిన బినాకా టూత్ బ్రష్ చిగుళ్ళను చీరదు,

mcm/ct/22 tel

# సినిమా

## సిలోన్‌లో ముగ్గురు హీరోలు

ఆగస్టు 11, 12 తేదీలలో మూడు భాషలకుచెందిన అగ్రనటులు సిలోన్‌లో వుంటారు ఆ ముగ్గురు ఎవరనుకుంటు న్నారు నటసామ్రాట్ నడిగర్ తిలగం, హిందీ మ్యాటనీ అయిడల్ గార్లే నిర్మాత రామానాయుడు తమిళంలో నిర్మించిన 'వసంతమాళిగై' (ప్రేమనగర్) సిలోన్‌లో రజతోత్సవం జరుపుకుంటున్న సంతోష సంబరంలో పాల్గొనడానికై హిందీ 'ప్రేమ నగర్' చిత్రాన్ని ఆరంభించిన రామానాయుడు మూడుభాషల్లోని కథానాయకులను రమ్మని ఆహ్వానించారు హీరోలతో బాటు వాణిశ్రీ, హేమమాలిని దర్శకుడు కె ఎస్ ప్రకాశరావుగార్లు కూడా సిలోన్ వెడుతున్నారని తెలిసింది సిలోన్‌లో యిలాంటి రజతోత్సవ సంఘటనే జరగడం యిదే ప్రథమం అదృష్టవంతుడ్ని ఎవరేమి చెయ్యగలరు? మొత్తానికి 'ప్రేమనగర్' చిత్రం రామానాయుడు జీవితంలో కొత్త అధ్యాయాన్ని సృష్టించింది మన తెలుగువాడు నిర్మించిన చిత్రానికి పరదేశంలో యింత గుర్తింపు రావడం ఆంధ్రులందరికీ గర్వ కారణం 'ప్రేమనగర్'కన్నా మిన్నగా వుండే చిత్రాన్ని తీయగలిగినప్పుడే, ప్రేక్షకులు ఒప్పుకొంటారు 'సెక్రటరీ' అలాంటి కథేగాబట్టి ప్రేక్షకులు ఆదరిస్తారన్న నమ్మకంతో నాయుడుగారు కార్యరంగంలోకి దిగాలి

## హిందీ ప్రేమనగర్ ప్రారంభం

విజయా—సురేష్ కంబైన్స్ ఈస్ట్‌మన్ కలర్‌లో తలపెట్టిన 'ప్రేమనగర్' చిత్రం షూటింగు జులై 26న వాహినీలో ప్రారంభమైంది లక్షరూపాయలు విలువ చేసే సెట్టు నిర్మించబడింది కళాదర్శకుడు కృష్ణారావుకు జోహారు చెప్పాలి ఈ చిత్రానికి కె ఎస్ ప్రకాశరావు దర్శకత్వం నిర్వహించడం నిర్మాతకు శుభయోగాన్ని సూచిస్తుంది ఇలా అనడానికి కారణం వుంది తెలుగు, తమిళభాషల్లో కనిపించిన లోపాలను దిద్దుకుని హిందీచిత్రాన్ని మరింత మంచిగా తీయగలరు ప్రకాశరావుగారు



'మైనరుబాబు'లో వాణిశ్రీ, శోభన్‌బాబు

### రాజేష్ — హేమ!

ఎందరో ప్రయత్నించారు, హేమమాలిని—రాజేష్‌ఖన్నాలను జంటగా కలపాలని కానీ ఎవ్వరికీ సాధ్యం కానిదాన్ని రామానాయుడు చెయ్యగలిగారు 'ప్రేమనగర్' నాయకీ, నాయకులుగా హేమా రాజేష్‌ఖన్నాలను పెట్టారు ఈ చిత్రానికి ఇందర్‌రాజ్ ఆనంద్ మాటలను, ఆనంద్‌బక్షీ పాటలను ఎస్ డి బర్మన్ సంగీతాన్ని సమకూరుస్తున్నారు సహాయభూమికలను ప్రేమ్‌చోప్రా, నజీర్ హుసేన్, కామినీకవుశల్, బిందు, నానా పలిస్కర్, జగదీప్ పద్మాఖన్నా ధరిస్తున్నారు ప్రముఖ నిర్మాత, వాహినీస్టుడియో అధినేత అయిన బి నాగిరెడ్డిగారు సమర్పించే యీచిత్రానికి ఏ విన్సెంట్ ఛాయాగ్రాహకుడు

## విన్సెంట్ దర్శకత్వం!

'కులగోత్రాలు' చిత్రం విడుదలయినప్పుడు, కెమెరా పనితనం చాలా బాగుంది అని ఆంధ్ర ప్రజలు తీర్పునిచ్చారు ఆ చిత్రానికి విన్సెంట్ ఛాయాగ్రాహకుడు మనకున్న వుత్తమ ఛాయాగ్రాహకులలో విన్సెంట్ ఒకరు

విన్సెంట్ మళయాళ రంగంలో గొప్ప దర్శకుడిగా విరాజిల్లుతున్నాడు ఆయన దర్శకత్వంలో వెలువడిన మళయాళ చిత్రాలన్నీ బాగా డబ్బు గడించియున్నాయి ఆయన్ను తమిళ 'జీవన తరంగాలు' చిత్రానికి దర్శకుడిగా పెట్టుకొన్నారు నిర్మాత రామానాయుడు

### శోభన్ పాత్రలో ముత్తురామన్

'జీవనతరంగాలు' చిత్రంలో శోభన్ వేసిన వేషాన్ని తమిళంలో ముత్తురామన్, కృష్ణంరాజు పాత్రను శ్రీకాంత్, చంద్రమోహన్ భూమికను శివకుమార్ ధరిస్తున్నారు రోజాగా వాణిశ్రీ లావణ్యగా లక్ష్మి, వేణుగోపాలరావుగా సుందరరాజన్ నటిస్తున్నారు ఈ చిత్రానికి ఏ ఎల్ నారాయణ మాటలను, కన్నదాసన్ పాటలను, కృష్ణారావు కళను విశ్వనాథన్ సంగీతాన్ని నిర్వహిస్తున్నారు శ్రీ రామానాయుడు నిర్మించిన 'వసంతమాళిగై' తమిళదేశంలో 175 రోజులు ప్రదర్శింపబడింది శివాజీగణేశన్ 1973లో హిట్‌చిత్రం అయికూర్చుంది 'ప్రేమనగర్'

## జగ్గయ్య అధ్యక్షత!

సురేష్ మూవీస్‌వారి 'జీవన తరంగాలు' చిత్రం ఆంధ్రప్రదేశ్‌లో 12 చోట్ల దిగ్విజయంగా యాత్ర సాగిస్తూవుంది. నూరు రోజుల పండుగను ఆగస్టు ఆయిదున విజయవాడ 'అలంకార్' థియేటర్లో భారీ ఎత్తున జరపడానికి, నిర్మాత రామానాయుడు, నవయుగ పంపిణీదారులు ఏర్పాట్లు చేశారు. శతదినోత్సవసభకు 'కళా వాచస్పతి' జగ్గయ్య అధ్యక్షత వహించి, హీరో కృష్ణ ముఖ్యఅతిధిగా పాల్గొనడం విశేషం. చిత్రంలో పాల్గొన్న ప్రతిఒక్కరూ యీ సంబరంలో భాగస్వాములయ్యారు. సురేష్ మూవీస్ నిర్మించిన 'జీవనతరంగాలు' పెద్ద క్రూర్ లెవల్‌కి తీసిపోనివిధంగా డబ్బు వసూలుచేసింది. ఇదే చిత్రం కలర్‌లో నిర్మించబడియుంటే, సిల్వర్ జుబ్లీని సులభంగా జరుపుకుని యుండేది.

## నవయుగ చిత్రాలు

నవయుగసంస్థ విడుదల చెయ్యవలసిన చిత్రాలు చాలావున్నాయి. జులై 28న 'నేరము—శిక్ష' కాగానే, ఏచిత్రం చెయ్యాలో తెలియని పరిస్థితి ఏర్పడింది. ఆరుచిత్రాలు విడుదలకు సిద్ధంగావున్నాయి. 'పల్లెటూరి బావ' మంచివాడు,' 'వంహృదయాలు,' మైనరుబాబు, మేము—మనుషులమే, స్త్రీగౌరవం చిత్రాలు రెడీగావున్నాయి. ఏది, ఎప్పుడుచేస్తారో, వేచిచూడాలి.

## రామారావును పెంచిన తండ్రి

గా, గుమ్మడి వెంకటేశ్వరరావు నటిస్తున్న చిత్రాన్ని 'కృష్ణావతారం' నిర్మాత పుండరీ కాక్షయ్య భాస్కర చిత్రపేరిట తయారుచేస్తున్నారు. ఈ చిత్రానికి బి. వి. ప్రసాద్ దర్శకుడు.

### వాణిశ్రీ సరోజాదేవి

ఈ చిత్రానికి గొల్లపూడి రచన, హనుమంతరావు సంగీతాన్ని సమకూరుస్తున్నారు. 'జీవితం' చిత్రంలో చక్కటి ఛాయాగ్రహణం చూపిన సత్యనారాయణ యీ చిత్రానికి డైరెక్టర్ ఆఫ్ ఫోటోగ్రఫీ. ఈ చిత్రంలో 'నటరత్న'తో వాణిశ్రీ, సరోజాదేవి, అంజలీదేవి, విజయలలిత, కృష్ణంరాజు, వరలక్ష్మి, ఫణిచక్రవర్తి నటిస్తున్నారు.

### చిన్న రామారావుగా చిన్న త్రివిక్రమరావు

ఈ చిత్రంలో చిన్న రామారావుపాత్రను, చిన్న త్రివిక్రమరావు (అంటే త్రివిక్రమరావు కుమారుడు) ఫణి చక్రవర్తి పోషిస్తున్నారు. 'ఎట్టకొంచెము, కూతఘనము' ఫణి చక్రవర్తికి వర్తిస్తుంది. డైలాగు డెలివరీ, భావప్రకటన సమపాళ్లలో చెయ్యగల ప్రతిభ యీ కుర్రవాడిలోవుంది. మంచి ఫోటోజనిక్ ఫేస్‌కూడావుంది. కెమెరా భయం కొంతయినా కనిపించలేదు. యితడు నటిస్తున్నప్పుడు ఇతగాడు దినదిన ప్రవర్ధమానుడై, ఏడెనిమిది సంవత్సరాల తర్వాత పెదనాన్న అంతటి నాయకుడు అవుతాడేమో అనిపిస్తుంది. 'నటరత్న' చిత్రం 'నటసామ్రాట్' పంపిణీలో విడుదల గావడం విశేషం కాదా?

## వాడే — వీడు

కథను ప్రముఖ రచయిత డి. వి. నరసరాజు వ్రాశారు. ఆ కథను గౌతమ్ ప్రొడక్షన్స్ అధినేత రామబ్రహ్మంకొన్నారు. రామబ్రహ్మంగారు సమయస్ఫూర్తి వున్న వివేకవంతుడు. ఆయనకు నరసరాజుగారిదన్నా, ఆయన రచనలన్నా మక్కువ ఎక్కువ. కథకుడు మాటలన్నీ వ్రాస్తేనేవుండే అందం మరొకరు వ్రాస్తే రాదు. ఈ కథకు సినిమా అనుకరణ, సంభాషణారచన నరసరాజే చేశారు. ఈ చిత్రాన్ని డి. యోగానంద్ డైరెక్టు చేస్తున్నారు. శ్రీ యోగానంద్ యోగజాతకులు. ఆయన చేబట్టే చిత్రాలో విజయాన్ని చవిచూసేవి ఎక్కువ. 'వాడే-వీడు'లాంటి మంచికథ వున్నప్పుడు, యోగానంద్‌గారు ఎంతో మంచి చిత్రాన్ని యివ్వడానికి కృషిచేస్తారు.

### రామారావు మంజుల

'వాడే—వీడు' చిత్రం జులై షెడ్యూలుతో 11 రీళ్లు పూర్తయినట్టు, రామబ్రహ్మంగారిద్వారా తెలుసుకున్నాం. ఈ చిత్రంలో నటరత్నకు కొత్త అమ్మాయి మంజుల జంటగా కుదిరింది. శృంగార ఘట్టాల్లో రామారావు, మంజుల రతీ మన్మధులవలె వున్నారట. ముఖ్యపాత్రలను నాగభూషణం, అల్లు రామలింగయ్య, పద్మనాభం, సంధ్యారాణి, పండరీబాయి, నాగరత్న పోషిస్తున్నారు. ఈ చిత్రానికి క్రిస్



'డాక్టర్ బాబు'లో జయలలిత

ఎస్ లాల్ ఛాయన, సత్యం సంగీతాన్ని నిర్వహిస్తున్నారు

*చెల్లెలుగా లీలారాణి*

'నటరత్న' రామారావు చెల్లెలుగా లీలారాణి నటిస్తోంది ఈ వేషం ఆమెకు అనుకోకుండా వచ్చింది అదృష్టవంతురాలికి అన్నీ యిలాగే సమకూరుతుంటాయి మొదట్లో యీ పాత్రకు జయను అనుకొన్నారు

*జయ ఇలా చెయ్యవచ్చా?*

'వాడే వీడు' చిత్రంలో రామారావుగారి చెల్లెలిపాత్రవుంది మీరువెయ్యాలి ఆఫీసుకు వస్తే డైలాగులు యిస్తాము ఒకసారి మీరు చదివి వినిపించండి అని గౌతమ్ ప్రొడక్షన్స్ వెంకటరత్నం జయకు చెప్పడం ఆమె తన కారులోనే గౌతమ్ ఆఫీసుకు వచ్చి, కథకుడు—సంభాషణ కర్త అయిన డి వి నరసరాజుగారు చెప్పిన మాటలను తమిళంలో వ్రాసుకుని, చదివి వినిపించడం, పాత్ర నచ్చిందని నటించడానికి అంగీకరించడం జరిగింది

జులై 12న షూటింగువుందని, వెంకటరత్నం వెళ్ళి చెప్పబోతే, తను నటించడం వీలుపడదని, జులై 11న (రేపు షూటింగు అనగా యివాళ) చెప్పడం జరిగింది ఇక ఏమీ పాలుపోక, అప్పటికప్పుడు లీలారాణిని చెల్లెలిపాత్రకు బుక్‌చెయ్యడం జరిగింది లీలారాణి కాల్‌షీట్లు లభించియుండకపోతే, నిర్మాత తీసుకున్న షెడ్యూలు ఏమి కావాలి? మిగతా నటీ, నటుల సంగతి ఏమికావాలి? నిర్మాత ప్రెస్టేజ్ ఏమి కావాలి? భగవంతుడు వున్నాడు గనక లీలారాణి సహృదయురాలు గనక షూటింగు సక్రమంగా జరిగింది

జయ ఇలాంటి అవకతవక పనులు చెయ్యడం తప్పుకాదా? చేస్తాను అని, చివరి నిమిషంలో చెయ్యలేనని చెప్పడం న్యాయమా? నిర్మాత అనేవాడు వుంటేనే, పరిశ్రమ నటీనటులు జీవించగలరన్న సత్యం జయకు తెలియదా? ముందు ముందు అయినా జాగ్రత్తగా వుండకపోతే

## పాపులర్ అయిన పాటలు

ఇటీవల ఆంధ్రదేశం వెళ్ళడం జరిగింది వెళ్ళినప్పుడు ప్రతి గ్రామఫోను కొట్టుదగ్గర నిలబడేవాడిని ఎక్కడకు వెళ్ళినా, 'ఇదా లోకం' పాటలను పదేపదే వినడం జరిగింది గ్రామఫోను రికార్డులో ఎక్కువగా అమ్ముడయ్యే ఆ పాటలు ఏవిటో పాఠకులకు తెలుపుతున్నాను./

*గుడిలో నాసామి*

కొలువైయున్నాడు అన్న పాటకు ఎక్కువ గిరాకీవున్నట్టు తెలిసింది ఈ పాటను వీటూరి వ్రాయ, జానకి—ఈశ్వరి పాడారు ఈ పాటకు చక్రవర్తి కూర్చిన బాణీలు పసందుగా వున్నాయి

*గట్టున*

కూచుంటే, ఏరు గలగలమంటుంటే, అనే పాటను యువతరం ఎక్కువగా అభిమానిస్తున్నట్టు తెలిసింది ఆచార్య వ్రాసిన పాట యిది సుశీల, రామకృష్ణ పాడారు చక్రవర్తిని తెలుగు బర్మన్ అంటున్నారు

*నా మనసు*

'నా మనసు ఏకమై' అనెడి డాక్టర్ నారాయణరెడ్డి విరచితమైన యీ పాటను యువతులు ఎక్కువగా అభిలషిస్తున్నట్టు తెలిసింది ఈ పాటను రామకృష్ణ, సుశీల పాడారు చక్రవర్తికి జోహారు అంటున్నారు ఇప్పటికి విడుదలయిన పాటల్లో పై నుదహరించిన మూడు పాటలు విశేష ప్రజాదరణ పొందాయి

## ఇదా లోకం

సమత చిత్ర నిర్మించిన 'ఇదాలోకం' షూటింగు పూర్తయింది ఈ చిత్రానికి కథను ఛటర్జీ వ్రాశారు ఈ కథ ఎంత బలమైనదంటే, రషస్ చూడగానే ఒక తమిళ పార్టీ తమిళం హక్కులు కావాలని కోరింది ఈ కథకు ఆదివిష్ణు మాటలను రచించారు.

*హీరో కథ*

ఈ చిత్రం హీరోకు ప్రాధాన్యతవున్న కథ కావడం, శోభన్‌బాబు అభిమానులకు ప్రత్యేక ఆనందాన్ని యిస్తుందనుకుంటాను వైవిధ్యమున్న రెండు పాత్రలను యీ చిత్రంలో పోషించాడు శోభన్‌బాబు ఒక పాత్రకు శారద, మరొక దానికి ఆరతి జంటగా నటించారు సహాయభూమికలను నాగభూషణం, అల్లు రామలింగయ్య రావుగోపాలరావు, చంద్రమోహన్ సుమ, శాంత ధరించారు ఈ చిత్రానికి చక్రవర్తి సంగీత సారధి 'శారద' తెచ్చి యిచ్చిన పేరును 'ఇదాలోకం' పెంపుచేసే



'మనుషు—మనసు'లో ప్రకాష్ చంద్రకళ, విజయలలిత




# పార్లే గ్లూకో బిస్కట్లు

పాపాయి పెరుగుదలకు పోషణ సమకూర్చేందుకు కావలసిన
విటమిన్లు, కాల్షియమ్, ప్రోటీన్లు గల పాలు, గోధుమ, పంచదార,
గ్లూకోస్‌లలోని శ్రేష్ఠత అంతా వీటిలో వుంటుంది.

చేతులకు తగలకుండా, ఆరోగ్యకరమైన పద్ధతిలో ముడి పదార్థాల దశలోనూ, పూర్తిగా
తయారయిన వెనుక కూడా నాణ్యతను గురించిన ప్రత్యేక శ్రద్ధతో పార్లే గ్లూకో
బిస్కట్లు తయారుచేయబడతాయి. అందువల్లనే హాయిగా జీర్ణమయే ఇవి
అపురూపమైన మీ పాపాయికి ఎంతో మంచివి.
ఎంతో రుచికరమైనవి...కనుకనే మీకూ తినాలనిపిస్తాయి!




భారతదేశంలో అత్యధికంగా
అమ్ముడయే బిస్కట్.
1971లో జెనివాలో శ్రేష్ఠతకు
కేటాయించబడిన ప్రపంచ
బహుమానం పొందినది.

everest/511/PP Tel

**పార్లే గ్లూకో —పోషక పదార్థాలతో కూడిన రుచికరమైన బిస్కట్!**

## సినిమా

విధంగా పాటలకు రాగాలు కూర్చాడు, చక్రవర్తి ఈ చిత్రాన్ని కె ఎస్ ప్రకాశరావు డైరెక్టు చేయ్యడంవల్ల 'తాసిలా రుగారమ్మాయి' స్థాయిలో వుంటుంది అని చెప్పొచ్చు లక్ష్మి ఫిలింస్‌ద్వారా విడుదలయ్యే యీ చిత్రానికి వి యాచేంద్ర నిర్మాత నిర్వహణచేసేది కధకుడయిన ఛటర్జీగారే ప్రేక్షకులు ముఖ్యంగా శోభన్‌బాబును ఆరాధించే అభిమానులు యీ చిత్రంపై కొండంత ఆశపెట్టుకొని యున్నారు

## గిరిబాబుకు గిరాకీ

'జగమేమాయ' చిత్రంలో 'తేనెపూసిన కత్తి'గా కొత్త నటుడు గిరిబాబును పరిచయంచేశారు, ఏ. పూర్ణచంద్రరావు, పి వి సుబ్బారావుగార్లు ఒక దిట్టమైన, గణనీయమైన విలన్ నటుడ్ని వెండితెరకు ప్రసాదించిన నిర్మాతలను అభినందించాలి అతడి చూపుల్లో, మాటల్లో 'పయోముఖ విషకుంభం' లక్షణాలు ఎంత సహజంగా గోచరిస్తాయో, 'జగమేమాయ' చూచినవాళ్లకు తెలుస్తుంది

ఆ చిత్రం చూచిన నిర్మాతలు కొందరు గిరిబాబుకు మంచి అవకాశాలు యిచ్చారు, యిస్తున్నారు పెద్ద నిర్మాతల చూపు అతనిపై బడింది గిరిబాబు ప్రవేశం విలన్ లేని కొరతను కొంతవరకు తీర్చవచ్చు అన్నభావం పరిశ్రమకు ఏర్పడుతుంది ఇతడికి పర్సనాలిటీతోబాటు యాక్టింగులో మెచురిటీ యిచ్చిన భగవంతుడ్ని, భగవత్ ప్రసాదితమైన క్వాలిటీకి జీవంపోసిన పూర్ణచంద్రరావుగారి మరువలేదు గిరిబాబు

విలన్‌వేషాలకు తప్ప మరొక దానికి తను సరితూగడు సరిపోడు అన్న విజ్ఞానం గిరిబాబు గుర్తించి, తదనుగుణ్యంగా వర్తించి, పరిశ్రమలో తనకొక ప్రత్యేకతను తెచ్చుకుంటాడని ఆశించవచ్చు

## లోకేశ్వరి ఆర్టు పిక్చర్స్'

విశ్వశాంతి విశ్వేశ్వరరావుగారి దీవెనలతో నెలకొల్పబడిన చిత్ర నిర్మాణసంస్థ ఇది ఈ సంస్థకు చిరంజీవి ఏ కె వి ప్రసాద్ అధినేత విశ్వేశ్వరరావుగారికి ఆప్తబంధువు సినిమా టెక్నిక్ బాగా తెలుసు ప్రసాద్ గారికి జూన్ 25న యీసంస్థ వెలసింది

### సంసార నౌక

ప్రముఖ నవలా రచయిత్రి మాదిరెడ్డి సులోచన రాసిన 'జీవితనౌక' నవలను లోకేశ్వరి ఆర్ట్స్ ఎక్సర్సైకొన్నారు ఆల్ ఇండియా రైట్సు యీ సంస్థకే చెందుతాయి మహిళాలోకానికి నచ్చిన కుటుంబ నవల 'జీవితనౌక'

### హెచ్చరిక!

ఈ నవలయొక్క యావద్భారత భాషల నిర్మాణపుహక్కులు మా దగ్గరవున్నాయి ఈ కథనుగాని, యిందులోని పాత్రలనుగాని, సంఘటనలనుగాని ఎవరైనా ఉపయోగించినట్లైతే అట్టివారు చట్టరీత్యా శిక్షింపబడతారు,' అన్నారు కథను కొన్న ప్రసాద్‌గారు

### కృష్ణ నాయకత్వం!

జీవితనౌక' చిత్రానికి బొల్లిముంత మాటలను, జి కె రాము ఛాయను చక్రవర్తి సంగీతాన్ని నిర్వహిస్తున్నారు విశ్వశాంతికి పర్మనెంటు అయిన ఎ ఎస్ రావుగారు యీ చిత్రానికి దర్శకత్వం నెరవుతున్నారు కృష్ణ కథానాయక పాత్రలను పోషిస్తున్నారు

## శారద శతదినోత్సవం

అన్నపూర్ణా ఎనీ ఎంటర్ ప్రైసెస్ నిర్మించిన తొలి చిత్రం 'శారద' ఆంధ్ర ప్రేక్షకులు కలకాలం మనస్సులో దాచుకునే చిత్రంగా వుండిపోతుంది ఈ చిత్రం పట్ల ఆంధ్ర ప్రజలు చూపించిన, చూపిస్తున్న అభిమాన ఆదరాలు నిర్మాత రాఘవరావుగారిని ఆనందాబ్ధిలో ముంచెత్తింది ఈ విజయం ఆయనలో నూతన వుత్సాహాన్ని రేకెత్తించింది చిత్రం దర్శకుడు విశ్వనాథ్ గారికి, నాయిక శారదకు, సంగీత సారథి చక్రవర్తికి క్యారెక్టర్ నటుడు రావుగోపాలరావుకు విశేషమైన పేరు పొగడ్తలను



'శైదీబాబాయ్'లో వాణిశ్రీ, శోభన్‌బాబు

ఆర్జించి పెట్టింది విలన్ సత్యనారాయణ సాఫ్ సత్యనారాయణగా కూడా రాణించగల డని నిరూపించింది శోభన్‌బాబు కామెడీని అద్భుతంగా చెయ్యగలడని డాక్టర్ మూర్తి పాత్ర ద్వారా ఋజువు అయింది అశేష ఆంధ్ర ప్రజల అభిమానాధనాన్ని దోచుకున్న 'శారద' ఆరు కేంద్రాలలో శతదినోత్సవం జరుపుకుంటుంది ఈ పండుగను భారీ ఎత్తున జరపడానికి నిశ్చయించారు, యీ చిత్రానికి అజాతశిరుడిగా వున్న క్రాంతి కుమార్

**12,న పండుగ**

'శారద' నూరురోజుల పండుగ ఆగస్టు 12 న మదరాసులో జరుగుతుంది ఈ పండుగను అన్నపూర్ణా సినీ ఎంటర్ప్రైజస్, జోతీ డిస్ట్రిబ్యూటర్స్ కలిసి చేస్తున్నారు

**హిందీలో, తమిళంలో**

తెలుగునాట విజయఢంకా మ్రోగించిన 'శారద'ను తమిళంలో సుందరలాల్‌నహతా, హిందీలో బాలాజీ నిర్మిస్తున్నారు హిందీలో సంజీవ్‌కుమార్, జయభాదురి, తమిళంలో ముత్తురామన్, ప్రమీల ముఖ్య పాత్రధారులు

## లక్ష్మీరమణ కంబైన్స్!

మదరాసు సినిమా నగరంలో వెలసిన మరొక సంస్థ యిది దీనిని కానూరి కృష్ణ నిర్మించారు వీరు మదరాసు హాలీవుడ్‌లో చాలాకాలంగా వుంటున్నారు పరిశ్రమ నుంచి, పెద్దలను బాగా అర్థం చేసుకున్నారు

**దర్శకుడైన ఎడిటరు!**

చిత్ర నిర్మాణంలో ఎడిటరు పాత్ర విలువైనది, విశిష్టమైనది చిత్రం చక్కగా రూపొందించే బాధ్యత ఎడిటరుది ఇంత వరకు ఎడిటింగు శాఖలో ప్రతిభను కనబరుస్తున్న సత్యనారాయణ (సత్యం) లక్ష్మీ రమణ కంబైన్స్ తలపెట్టిన చిత్రానికి తన శాఖతోబాటు, దర్శకత్వాన్ని కూడా చేపట్టారు,

**ఇంటింటి కథ**

ఎడిటరు సత్యం డైరెక్షన్ చేస్తున్న చిత్రం పేరు యిది ఈ చిత్రానికి 'పూలరంగడు' రంగనాయకమ్మ మాటలను సమకూర్చింది సంగీతాన్ని రమేష్‌నాయుడు, ఛాయను జి కె రాము నిర్వహిస్తున్నారు జులై 16 వ, వాసూ స్టూడియోలో షూటింగు ఆరంభమైంది

**కృష్ణ — చంద్రకళ**

ఈ చిత్రంలో కృష్ణ, చంద్రకళ గుమ్మడి, అంజలీదేవి, పద్మనాభం, రమాప్రభ, సుమ, సత్యనారాయణ ముఖ్య పాత్రధారులు దేవదాస్ అనే విలన్ నటుడ్ని పరిచయం చేస్తున్నారు ఈ దేవదాసు

మద్రాసు యాక్టింగ్ స్కూలులో తెలుగు శాఖకు ఉపన్యాసకుడిగా వుంటున్నారు 'కలం మారింది'లో ఒక చిన్న వేషం వేసారు.

## నేను బాగున్నానా

నా వగలు బాగున్నాయా
నీవు కోరేది విషం పెంచేది

నేను కాదంటానా అంటూ సెక్స్ బాంబ్ జ్యోతిలక్ష్మి క్లబ్బులో అంగవిన్యాసం చేస్తే, ఆమె అవయవ సోయగాన్ని కళ్ళప్ప గించి చూడనివాళ్ళు ఎవరయినా వుంటారా? ఆమె శృంగార చేష్టలకు, ఒళ్ళూ కళ్ళు తెలియక అక్కడివాళ్ళు అయిన్ అయ్యా రంటే నమ్మండి జ్యోతిలక్ష్మి అభినయంలో అంత మజా రావడానికి కారణం ఈశ్వరి చేత ఖుషీగా పాడించే విధంగా కవి ఆరుద్ర కలం పలికింది కవి పలుకులకు చక్రవర్తి రాగాలు అందాన్ని చేకూర్చింది. ఈ అభి నయం, గానం కవిత్వం సంగీత సామర్థ్యం దర్శకుడు కె ఎస్ రెడ్డికి ఎంతో తోడ్పాటు నిచ్చాయి

### స్వాతి ఇంటర్నేషనల్స్

ఈ దృశ్యం స్వాతి ఇంటర్నేషనల్ వారి తొలి చిత్రంలో కలిపిస్తుంది ఈ సంస్థకు ఎస్ కె పి రెడ్డి అధినేత 'కొరడా రాణి' కె ఎస్ రెడ్డి యీ చిత్రానికి దర్శకుడు ఆయ కు చక్రవర్తి హరి విశ్వామిత్ర, బి ఎస్ కృష్ణ కందస్వామి లాంటి ప్రతిభావంతులు సాంకేతిక సారథులుగా దొరి కారు కథను నిర్మాత అర్ధాంగి శ్రీమతి విజయ వ్రాశారు.

# సినిమా

### జ్యోతిలక్ష్మి ద్విపాత్రాభినయం!

'ఈ చిత్రంలో రామకృష్ణ కథానాయ కుడు జ్యోతిలక్ష్మి ద్విపాత్రాభినయం చేస్తున్న చిత్రం యిది ఇది క్రయిమ్ చిత్రం కాదు క్రయిమ్ ఎలిమెంటువున్న కుటుంబ చిత్రం' అన్నారు దర్శకుడు కె ఎస్ రెడ్డి

## శోభన్, వాణిశ్రీల డ్యూయెట్

ప్రేమ ప్రణయం, ఈ రెంటి సంభవం ఒక్కోసారి సంభ్రమంగా జరుగుతుంటుంది ఎవరికెవరో తెలియనివారు, ముందెన్నడూ కలుసుకోనివారు హఠాత్తుగా కలుసు కోవడం మరుక్షణమే ఒండొరులు ప్రేమా యణంలో పడడం గమ్మత్తుగా జరుగు తుంటుంది మైనరుబాబు విషయంలో గూడా అదే జరిగింది కారున్న మైనరు బాబుకు బజారులో కుంకుమ, నల్లపూసలు అమ్ముకునే దాసరి అమ్మాయికీ సఖ్యంకల్గి, సన్నిహితులవడం ఒటుంచి, డ్యూయెట్లు పాడడంవరకూ వెళ్ళింది

'రమ్మంటే గమ్మునుంటా డందగాడు—
బలే అందగాడు—హత్తిరి
వెళ్ళిపోతుంటే నా వెంట పడతనంటడు,
బలే గడుసుగుండడు' అని పూసల పిల్ల పరిహసిస్తుంటే
'ఊరుకుంటే గీరతుంటది కోతిపిల్ల,
బలె కొంటెపిల్ల—హత్తిరి
చేరబోతినే ఒరబ్బో జారుకుంటదీ
అయ్యో జడుసుకుంటదీ' అని బదులు పలికాడు షోగ్గాడు మైనరుబాబు కట్ అన్నారు దర్శకులు తాతినేని ప్రకాశరావు గారు మైనరుబాబుగా శోభన్‌బాబు పూసల పిల్లగా వాణిశ్రీ టించిన ఈ 'మైనరు బాబు' చిత్రంలో రంగారావు గుమ్మడి, చంద్రమోహన్ అంజలీదేవి సూర్యకాంతం ముఖ్య పాత్రధారులు

ఆత్రేయ భమిడిపాటి కలాలకు చలపతి రావు సంగీతం జి వి సుబ్బారావు ఆర్టు కె, యస్ ప్రసాద్ కెమెరా తోడుగా, వాడిగా పనిచేసాయి శ్రీ సారధి అండ్ టి ఎ ఆర్ క బ్యానరుపై నిర్మించబడ్డ ఈ చిత్రానికి కథ స్క్రీన్‌ప్లే తోబాటు దర్శ కత్వాన్ని గూడా నిర్వహించారు ప్రకాశ రావు టి నవయుగ ద్వారా విడుదలౌతుంది త్వరలో

## మనువు—మనసు

మనసున్న ఏ మనిషి మనసిచ్చిన మగు వకు అన్యాయం చెయ్యడు పవిత్రమైన ప్రేమను పరిహాసంగా భావించి నమ్ముకొన్న ప్రియురాలి ఆశలను వమ్ముచేసి సొమ్ము కోసం మరో వనిత కొంగు పట్టుకొం టాడు చంద్రం పేరుకు ఆవిడ చంద్రం అర్ధాంగియే అయినా అధికారమంతా ఆవిడదే సుఖాలకోసం దరిచేరిన చిన్నదాన్ని కాదని, ఆడంబరం అహంకారాలకు నిలయ మైన స్త్రీని తన కళత్రంగా స్వీకరిస్తాడు చంద్రం చంద్రాన్ని డబ్బుకోసం ఎంత పని చేశావని ఎత్తి పొడుస్తూ రకరకాలుగా అతని మనస్సును నొప్పిస్తుంది ఆ స్త్రీ

'మగువ మనువు మనసు' ఈ మూడిం టికి మధ్య గల సంబంధాన్ని పరిస్థితుల వల్ల, మనుష్యులలోని బలహీనతలవల్ల అవి ఎలా తారుమారు అవుతాయో అన్న సత్యాన్ని సోదాహరణంగా వివరిస్తూ నిర్మింప బడిన చిత్రమే సాంధ్యశ్రీ ప్రొడక్షన్సు వారి 'మనువు—మనసు'

చంద్రకళ ప్రకాష్ విజయలలిత ముఖ్య పాత్రలను పోషించిన ఈ చిత్రానికి కథ, స్క్రీన్‌ప్లే దర్శకత్వాన్ని పి చిన్నపరెడ్డి నిర్వహించారు తారకరామా విడుదలచేసే ఈ చిత్రానికి పి త్రినాధరావు నిర్మాత

—శ్రీనివాస్ ●



'పల్లెటూరిబావ'లో నాగేశ్వరరావు, రమణారెడ్డి, లక్ష్మి

## జాతి విచక్షణ

దక్షిణాఫ్రికా శ్వేత ప్రభుత్వంవారు ఒకాయనను రంగుజాతీయునిగా గుర్తించి, ఆయన కూతుర్ని మాత్రం ఆఫ్రికనుగా గుర్తించారట. ఆమే తన కూతురేనని, కనుక తన జాతేనని ఆయన నూటొక్క నిదర్శనాల్చూపించినా, కోర్టు ఒప్పుకోలేదట. చివరి కాయన ఊహ చేసేదిలేక, తన కూతురును వదలలేక, ఆమెను తనింట పనిమనిషిగా నియమించుకున్నాడట —ఏం! నమ్మబుల్‌గా లేదా!

## విచిత్రమైన పరిస్థితిలో కాబరే నర్తకి శవం!

బెంగుళూరుకు చెందిన 30 ఏళ్ళ కాబరే నర్తకి రేఖ జూన్ 10వతేదీన కొచ్చిన్‌కు వెళ్ళి అక్కడ వో పెద్ద హొటలులో కాబరె ప్రదర్శనలిచ్చిందట. 23వ తేదీన మూడు ప్రదర్శనలిచ్చి, అర్ధరాత్రి తనరూముకు వెళ్ళిన రేఖ తెలవారెంతసేపయినా బయటికి రాకపోడంలో పోలీసులు జోక్యం కలుగ జేసుకుని తలుపురెత్తి చూస్తె, స్నానాలగదిలో ఆమె చచ్చిపడున్నదట. ఆమె చేతిలో కరెంటు వైరున్నదట. ఇది హత్యా, ఆత్మహత్యా అనిపోలీసు విచారిస్తోంది.

## లైంగిక విజ్ఞానం

లైంగిక సంబంధ విషయాలు వివరంగా బోధన చేయడానికి కేరళ ప్రభుత్వం వో పద్ధతి కనిపెట్టిందట. కొచ్చిన్‌లో దీనికి వో కోర్సు ఏర్పరచారట. ఈ కోర్సులో నాలుగు వారాల పాటు 18 ఏళ్ళు పైబడిన యువతీ, యువకులకు లైంగిక పాఠాలు చెప్తారట. ఈ పాఠాలలో లైంగిక సమస్యలు, లైంగిక వ్యాధులు, మానసిక సమస్యలు అన్నీ బోధిస్తారట— కొచ్చిన్ మనూరి కెంత దూరం బాబూ!




# ఒక వారం విపరీతం ఫాలాక్షుడు

## తలుకోయి మాసారం!

వేల్లూరు మెడికల్ రిప్రజంటేటివ్స్ఎసోసిఏషను వారు అదేవూళ్ళో వున్న యం.యస్.నారాయణ అనే వో మెడికల్ రిప్రజంటేటివ్‌కి వో పోసు కార్డు రాస్తే ఆ కార్డు రిమ్మన మద్రాసు వెళ్ళి అక్కడో వారం రోజులు నగరంచూసి. తిరిగి వెలూరు వెళ్ళిందట. కార్డులో విషయం 'మూడో తారీఖు మీటింగుకు రమ్మ'నుందట. ఆ కార్డు నారాయణగారికిఏదో తేదీ చేరిందగా— తలుకో ఏ మాసారమనవేమి'

## మంత్రిపదవికి ఎసరు?

మైసూరు రాష్ట్రమంత్రి బసవలింగప్పగారీమధ్య హిందూసమాజం వారికి బాధకలిగించేలాటి ప్రసంగాలు చేశారని, కనుక ఆయనను వెంటనే మంత్రి పదవినుంచి మైసూరు రాష్ట్ర ముఖ్యమంత్రి తొలగించకపోతే, తాను ఆయన కార్యకలాపాలకు అంతరాయం కల్గించే విధానంలో ప్రవర్తించాల్సి వుంటుందనీ హిందూరాజ్య పక్ష ప్రధానకార్యదర్శి కర్తార్ సింగ్ తట్టే అన్నారట. తాను ముఖ్యమంత్రి దేవరాజు అర్స్‌కు 15 రోజులు గడువిచ్చినట్టుకూడా ఆయన 25వ తేదీన వెల్లడించారట.

## ముఖ్యమంత్రి కోడలిపై తుపాకి కాల్పులు!

హరియానా ముఖ్యమంత్రి బన్సీలాల్‌గారి కుమారుడు రన్‌బీర్‌సింగు గారీ భార్య తుపాకిగాయాలతో స్పృహతప్పి యింట్లో పడుందట. ఆమెను ప్రమాద స్థితిలో ఆసుపత్రిలో చేరిస్తే, డాక్టర్లు శస్త్ర చికిత్స చేసి అంతటి అపాయాన్ని దాటినట్టు ప్రకటించారట. అసలామెకు తుపాకీగాయాలెలా అయ్యాయి! అది హత్యా ప్రయత్నమా! లేక ఆత్మహత్యా ప్రయత్నమా! పోలీసు విచారిస్తోంది.

## రివాల్వర్ ప్రమాదం

మైసూరురాష్ట్ర ఆర్థిక శాఖామంత్రిఘోర్పాడే గారి పెద్దకొడుకు 18 సంవత్సరాల అజయ్ రివాల్వరుతో ఆడుకుంటుండగా అది ఢమ్మని పేలి గుండోటాయన పొట్టలో దూచుకు, చొచ్చుకు పోయిందట. బియస్సి చదువుతున్న యీవిద్యార్థిని వెంటనే (28వ తేదీ వుదయం) ఆసుపత్రిలోచేర్పితే చికిత్స చేస్తున్నారట డాక్టర్లు. ఆతనిపొట్టలో గుండు దూరడం ప్రమాద వశాత్తా...లేక అనే విషయం మీద పోలీసుపెదవి విప్పలేదట.

## విజయవాడలో విరుచుకుపడ్డ కొండ

విజయవాడలో జూన్ 30వ తేదీన వోకొండ ముక్కవిరిగి, కొన్ని పాకలమీద పడ్డ ఫలితంగా సుమారు యిద్దరైనా చనిపోయివుండివుంటారని, అసలు సంఖ్య చెప్పాలంటే ఆకొండరాళ్ళన్నీ తీయాల్సిందేననీ ఆసంబంధమైన అధికారులన్నారట.

## భర్త పెట్టే హింసలు భరించలేక భార్య ఆత్మహత్యా ప్రయత్నం

కరువంపాలెం అనే వూరుకు చెందిన కొండతాళ్ అనే ఆమెను ఆమె భర్త అనుదినమూ హింసిస్తూ, వుండడమే గాక, సరిగా తిండి కూడా పెట్టక,




చిత్రహింస పెట్టేవాడట. ఈ బాధలు పడలేక, ఆమె తన ముగ్గురు పిల్లలను నూతిలో పడేసి, తాను కూడా దూకిందట. కాని, అక్కడ కూడా విధి వెక్కిరించడం వల్ల ఆమె, ఆమెతో పాటు 9 ఏళ్ళ కొడుకు బ్రతికారట. చట్టం ఆమె మీద హత్యానేరం, ఆత్మహత్య ప్రయత్న నేరం మోపి, యావజ్జీవ శిక్ష విధించి, ఆనక మూడేళ్ళ శిక్షగా మార్చి రూపొందించిందట.

## 5 నెలల్లో 297 హత్యలు!

మైసూరు రాష్ట్రంలో గడచిన అయిదు నెలల్లో 297 హత్యలు జరిగాయట. కేవలం మే నెలలోనే 60 హత్యలు జరిగాయట. ఇవిగాక జనవరినుంచి మేనెల వరకూ రాష్ట్రంలో 1874 దొంగతనాలు, మోసాలూ వగైరా జరిగాయట. ఈ విషయాలు పోలీసు ఇనస్పెక్టరుజనరల్ సి. వి. యస్. రావు గారన్నారట. విద్వాన్ సర్వత్ర పూజ్యతి..... అంటే!!

# ఒకవారం విశేషం

### పావుగంటకో యిల్లు

పూరిపాకలు, మురికివాడలు నిర్మూలించే బృహత్ కార్యంలో తమిళనాడు రాష్ట్రం అరగంట కోయిల్లు కడుతోందని, యింకా పావుగంట కోయిల్లు చొప్పున కట్టాలని చూస్తోందని ఆబోర్డు అధ్యక్షుడు శ్రీ రామ అరంగన్నల్ వెల్లడించారట. గంటకు నాలుగులెక్కయితే... వాళ్ళు.... ఇండియా యీజు నిర్మాణపూర్..!

### 'ప్రభాత్‌పై' ప్రేక్షకుల ఆగ్రహం

నటి జయకౌసల్య నటించిన హిందీచిత్రం "ప్రభాత్" కథ కేవలం వేశ్యల జీవితాలకు సంబంధించినదట. అయితే యీ సినిమాలో రాము—సీత—రావణ అని వో మూడు పాత్రలకు పేర్లున్నాయట. ఈ రకం సినిమాలోని పాత్రలకు పురాణ పురుషుల పేర్లు పెట్టి, నిర్మాత భాగవతాపచారం చేస్తున్నారని, హిందూ సాంప్రదాయాన్ని వెక్కిరిస్తున్నారని, ఢిల్లీలో కొంతమంది యీ సినిమా ప్రదర్శించరాదని పట్టుపట్టారట. తత్ఫలితంగా "ప్రజల కోరిక మేరకు ఆ పేర్లు మారుస్తానని, తాను ఏ దురుద్దేశంతోనూ ఆ పేర్లను వాడలేదని, మతాన్ని అవమానించడం తన అభిమతం కాద"ని, నిర్మాత రాజేంద్రయాళ్ ప్రకటించారట— పేర్లు మార్చిన సినిమాయేగదా సరి!

### పెళ్ళికూతురిపై అఘాయిత్యం

కృష్ణగిరి తాలూకా కత్తిరిపల్లి గ్రామంలో 38 ఏళ్ళ మునుసామి అనే అతని కూతురు 18 ఏళ్ళ పార్వతికి జూన్ 20వ తేదీ పెళ్ళి నిశ్చయమయ్యిందట. పెళ్ళికూతుర్ని పెళ్ళి వారంరోజులు వుందనగా పూరుచివర కట్టిన వో గుడిశలో విడిగా వుంచడం వాళ్ళ ఆచారమట. ఈ ఆచారం ప్రకారం ఆమెను మేళతాళాలతో వూరుచివర కట్టి సిద్ధం చేసిన గుడిశకు తీసుకుపోతుండగా మధ్యేమార్గంలో 30 ఏళ్ళ లక్ష్మప్ప అనే యువకుడు కత్తితో పెళ్ళికూతుర్ని మీదికి లంఘించి, ఆమెను పొడిచాడట. ఈ సందర్భంలో అతన్ని వారించిన నలుగుర్ని కూడా విపరీతంగా పొడిచి, అతను పారిపోయాడట. ఆ నలుగురిలో 60 ఏళ్ళ లక్కమ్మ అనే ఆవిడ అక్కడికక్కడే చనిపోయిందట. దాంతో పెళ్ళివారికి కోపం వచ్చి, ఆ లక్ష్మప్పను తరిమి, పట్టుకుని వో లాంతరు స్థంభానికి కట్టి చావబాదారట. ఆ బాదుడుకు లక్ష్మప్ప చనిపోయాడట— అసలు లక్ష్మప్ప యీ కిరాతుకం ఎందుకు చేశాడో తెలియలేదు.

### ప్రాణం తీసిన తగాదా

బెంగళూరు సెయింట్‌జాన్స్ వైద్యశాల ప్రాంతానికి చెందిన బస్సీ అనే అతనికీ, దేవరాజ్ అనే అతనికీ డబ్బు విషయంలో ఏదో తగాదా వచ్చి రోజూ తన్నుకునేవారట. ఒకనాడీ తన్నులాట పాలు ఎక్కువైనందువల్ల దేవరాజ్ కత్తి తీసుకుని బస్సీని కసకస ఒక్కటే పోటు పొడిచాడట. ఆ దెబ్బకు బస్సీ అక్కడికక్కడే గిలగిల్లాడి తన్నుకుని చనిపోయాడట.

### నీటిలో విద్యుత్తు—
### బావిలో దిగిన ఏడుగురి మరణం

అహమ్మద్‌నగర్ సమీపంలో వున్న గంగేగాన్ అనే వూరికి చెందిన గోవిందకరాత్ అనే ఆయన పొలంలో వున్న నూతిలో పంపు సెట్టు పని చేయడం మానేసిందట. ఆ నుయ్యి చాలా లోతు వుందట. గోవిందకరాత్ ఆ పంపుసెట్టు బాగుచేయడానికి నూతిలోకి దిగి, ఎంతసేపటికి బయటకు రాలేదట. కారణమేమిటని ఆయన తమ్ముడు, ఆ వెనుక మరో అయిదుమంది శ్రేయోభిలాషులూ కూడా నూతిలోకి దిగారట. పంపు సెట్టులోంచి పుట్టినకరెంటు నూతినీళ్ళల్లోకి ప్రవహించడం వల్ల మొత్తం నుయ్యంతా, నీళ్ళన్నీ షాకుకొట్టి, ఆ ఏడుగురూ చనిపోయారట.

### బీరువా కింద పాము

ఏకాంబరకుప్పం అనే గ్రామంలో వో 25 ఏళ్ళ కుర్రాడు వాళ్ళింట్లో వున్న వో బీరువా క్రింద పాత పుస్తకాలు పెట్టబోయేసరికి, ఆ బీరువా క్రింద తల దాచుకున్న పాము అతన్ని కాటువేసిందట. తనను కరిచింది పామని అతనికి తెలియక, ఏ ఎలకో కరిచి వుంటుందని ఆ రాత్రి నిర్లక్ష్యం చేశాడట. మర్నాడాయన బీరువా క్రిందనుంచి పాము బయటికి వచ్చిందట. దాంతో అతని తల్లిదండ్రులు అతన్ని బ్రతికించుకోడానికి నానా వైద్యాలు చేసినా, ఫలితం దక్కలేదట.

### బంగ్లాదేశ్‌లో అత్యాచారాలు!

బంగ్లాదేశ్‌లో దుండగాలు ఎక్కువైపోతున్నాయట. పోయిన జనవరి 1972 నుండి మొన్న 1973 జూన్ పదిహేనో తారీఖు నాటికి 4925 మంది క్రూరంగా హత్య చేయబడ్డారట. 377 మంది స్త్రీలు అపహరింపబడ్డారట. 1972 నుంచి 1943 ఏప్రియల్ వరకూ 2035 రహస్య హత్యలు జరిగాయట. ఈ వివరాలన్నీ అక్కడి హోంమంత్రిగారు వెల్లడి చేశారట. ●



# ప్రతివారికి రక్షణ కావాలి




ఈ రక్షణ బాక్టీరియానుండి, చెమట వాసననుండి—మీరు, ఇతరులు సంకోచపడే అవస్థనుండి-
జీ-11 కూడిన సింథాల్ టాయిలెట్ పౌడరు మీకీ రక్షణలన్నీ ఇస్తుంది. ఇవేకాదు—సువాసన...
సుమసుగంధము.

**సింథాల్ —**

దుర్గంధముల నుండి సంపూర్ణ రక్షణనిచ్చు టాయిలెట్ పౌడరు

వాడు. కానీ ఆఫీసులో అందరూ వాడు చాలా డబ్బున్నవాడని చెప్పుకుంటారు. పెళ్ళాం తరఫున చాలా ఆస్తి కలిసిందట! కానీ వాడి నలుగురు పిల్లలూ ఎప్పుడూ పేలికల్లాంటి బట్టలు కట్టుకుని కొట్లాడుకుంటూ ఉంటారు. పెళ్ళానికికూడా ఒక మంచి చీరలేదు. ఎప్పుడూ రంగు వెలిసిపోయిన మాసి కల్లాంటి చీరలు కట్టుకుని ఉంటుంది. అవయినా రెండు కాబోలు ఉన్నాయి. వీడుకూడా ఇక్ష్వాకుల కాలంలో కుట్టించుకున్న బట్టలే ఇప్పటికీ కడతాడు. ఇంట్లోకూడా సామానేమీ లేదు. అల్యూమినియం గిన్నెలు, విరిగిన కుర్చీలే కళ్ళకి కనబడతాయి. నాకుమాత్రం వాళ్ళు నిజంగా డబ్బుకి ఇబ్బంది పడుతున్నారనిపిస్తుంది. కానీ చంద్రం మాత్రం. 'వేషం, నెలకి రెండువందలయాభై వస్తాయంటే ఏం చేస్తున్నట్టు, ఏదో లొసుగు ఉంది' అంటాడు.

కాని ఒకమాట అడిగేస్తే తీరిపోతుంది. ఎక్కడికో సగువనికి వెళ్ళక్కరలేదు కదా అని ఉమాపతి ఇంటివైపు నడిచాను. అది ఒక చిన్న పెంకుటిల్లు, గూభ్యంలా ఉంటుంది. ఇప్పుడో, అప్పుడో కూలడానికి సిద్ధంగా ఉన్నట్టు ఉంటుంది. అరుగుమీద పెద్దబ్బాయి, మూడోపిల్ల నెత్తిన ఎందుకో మొదుతున్నాడు. ఆ పిల్ల అన్నగారి జుత్తు గుప్పిట్లో చిక్కించుకుని గుంజుతూ తాను తక్కువదాన్నేనని నిరూపించుకుంటోంది. పెద్దాడు చెల్లెల్ని ఒక్క తోపుతోసి లోపలికి పారిపోయాడు; క్రిందపడ్డ ఆ పిల్ల ఘొల్లుమంటూ సివంగిలావలా పెద్దాడిని పట్టుకోడానికి లోపలికి పరిగెత్తింది.



# ఆటోగ్రాఫ్

(16వ పేజీ తరువాయి)

గుమ్మంలో నిలబడ్డ నాకు, 'ఆగండి' అన్న గదమాయింపు వినబడింది. ఉలిక్కిపడి చుట్టూ చూశాను. ఎవరూ లేరు.

'ఈ సంగతి తేల్చి మరీ వెళ్ళండి' ఇప్పటి మాటలు లోపల ఉమాపతిభార్య అంటూన్నవని సులభంగా గ్రహించ గలిగాను.

'మీకేం అప్పు దులిపేసుకుని చక్కాపోతారు. తరవాత వీళ్ళని సముదాయించలేక నేను చావాలి!' మళ్ళీ అంది ఆవిడ.

'ప్లీజ్. సుధీ. నువ్వే ఎక్కడో ట్రై చెయ్యి. నెలమధ్యలో అప్పుతెస్తే నెలాఖర్లు దొరికేదెట్లా?' దీనంగా ఉన్న ఆ గొంతు ఉమాపతిది.

'మీకు ఎన్నిసార్లు చెప్పినా ఎందుకు అర్థంకాదు? పట్టుమని జీతాలువచ్చి పది రోజులు గడవకుండానే రెండుసార్లు బియ్యం అప్పుతెచ్చి, మూడోసారి అప్పు బయలుదేరితే వాళ్ళేమనుకుంటారు? ఆ అప్పు తీరిస్తేగాని మళ్లీ తేవడానికి వల్లకాదు. ఏంచేస్తాం? ఎప్పుడూ ఉన్న తద్దినమేగదా పాతిక రూపాయలు ఎక్కడో చూడండి.'

'ఒక్కసారి పాతిక అంటే మాటలా? అప్పట్లు చిన్న జొన్నపిండి ఉందన్నావు కదూ! ఈ పూట ఎలాగో గడిపేయి. ఈలోగా ఎక్కడో చూస్తానులే' అనే మాటలతోపాటు ఉమాపతి బయటకు వచ్చాడు.

నన్ను చూస్తూనే మొహంమీద నవ్వు అనే ముసుగుని కప్పుకుని, 'హలో శేఖర్. ఏమిటిలా వచ్చావు. అలా నిలబడిపోయావే? లోపలికిరా!' అంటూ ఆహ్వానించాడు.

నేను పట్టుబడిపోయిన దొంగలా సిగ్గుపడి, 'ఏమీలేదు. ఇలా వెళుతూ ఒకసారి కనబడి పోదామని వచ్చాను, వెళతాను' అన్నాను విరిగినమెట్లు దిగుతూ!

'ఉండరా నేను అలా వస్తాను' అరిగిపోయిన చెప్పులు వేసుకుని వెనకాలే వచ్చాడు ఉమాపతి. ఇద్దరం ప్రక్క ప్రక్కనే నడుస్తున్నాం. వాడు ఏమడుగుతాడో నాకు తెలుసు. నాకు కావలసిందే వాడూ అడుగుతాడు. ఇద్దరం ఒకే గూటి పిట్టలం.

'ఏమీ అనుకోకపోతే ఒకటి అడుగుతానురా' నాంది పలికాడు ఉమాపతి.

అడిగాక లేదనేకన్నా ముందే నా పరిస్థితి చెప్పేస్తే బాగుంటుందనిపించింది నాకు. 'నా మాట కూడా ఒకటి విని ఏమి అడగా అనుకొంటున్నావో విన్పించుకోకుండా అడుగు! ఎలాగో ఒకలా పదిహేను రూపాయలు సర్దు. పీజు చూసుకుని ఇచ్చేస్తా' గోడల మీది వాల్‌పోస్టర్లు చూస్తూ అన్నాను. ఆ మాటకి వాడి మొహంలో ఎన్ని రంగులు మారి ఉంటాయో ఊహించుకోగలిగాను.

'నేను అడగబోయేది అదే 'హిహి'మని జీవంలేని నవ్వు నవ్వి. 'సరే పోనీ, పనుంది అలా వెళ్ళి వస్తా' రోడ్డు క్రాస్ అయిపోయాడు ఉమాపతి.

స్పీడ్‌గా వస్తున్న స్కూటర్ నా ప్రక్కనే ఆగడం నేను గమనించనేలేదు. 'ఇంటి దగ్గరే ఉండరా, ఇప్పుడే ఐదు నిముషాల్లో వచ్చేస్తా' అనేసి తుర్రుమని వెళ్ళిపోయాడు చంద్రం. వెదకబోయిన తీగ కాలికి తగిలినట్లయింది. ఇక ఎక్కడికీ వెళ్ళనక్కరలేదు. ఇంటికే వచ్చి చంద్రం ఇస్తాడు. ఆహా, ఏమి సుదినం ఈ రోజు, అనుకుంటూ ఇంటికి వచ్చేశాను. ఐదు నిముషాలకి వస్తానన్న మనిషి గంటన్నరయినా పత్తా లేదు. ఈ లోపులో ప్రక్క హోటల్‌లో మండుతున్న కడుపులో ఇంత బూడిద పోసుకుని వచ్చి మంచం మీద వాలాను.

అడగ్గానే డబ్బు ఇచ్చేశాడు చంద్రం. నీట్‌గా తయారై సినిమాకి వెళ్ళాను. హాలు నిండా నా అభిమాన హీరో, హీరోయిన్ల బొమ్మలే. మా శ్రీమతి 'ఆ హీరోయిన్ చిన్నప్పుడు మా క్లాస్‌మేటే! చీమిడి ముక్కుతో, చింపిరి జుట్టుతో, చిరిగిన బట్టలతో క్లాస్‌కి వచ్చేది. మాష్టారు ఆ పిల్లని కొట్టనిరోజే ఉండేది కాదు.' అనేది నవ్వుతూ. నేను నమ్మలేదు. నన్ను ఉడికించడానికే అలా అంటోందని నాకు తెలుసు.

ఎలాగో టికెట్ కొనుక్కుని లోపలికి వెళ్ళాను. సినిమా మొదలవకుండానే 'హీరో, హీరోయిన్లు వచ్చారు.' 'హీరో, హీరోయిన్లు వచ్చారు' అని ఒకటే గోల. చూస్తూండగానే హీరో హీరోయిన్లిద్దరు మెరుపులా స్టేజీమీదకు వచ్చారు. ఎగిరి దూకా[illegible] ఎలాగో పట్టి


జలుబు, ఫ్లూతో బాధపడే వారి కోసం
UC-3 TEL
జలుబు మిమ్మల్ని ఏమీ చెయ్యలేదు:
మీరు కోల్డారిన్ తీసుకుంటే. జలుబు,
ఫ్లూ యొక్క లక్షణాలన్నిటినుంచీ వెంటనే
ఉపశమన పొందటం కోసం,
రోగనిరోధక శక్తిని
పెంపొందించగల
విటమిన్ సి ఉన్న
మాత్ర యిది–
Two-Layer Painkiller
COLDARIN
COLDARIN
ప్రత్యేకంగా తయారు చేయబడిన కోల్డారిన్, మీకు జలుబు, ఫ్లూ వలన కలిగే అన్ని బాధల నుంచీ వెంటనే ఉపశమన కలిగిస్తుంది. దీనిలోగల విటమిన్ సి మీ రోగనిరోధక శక్తిని పెంచుతుంది. జలుబు యొక్క లక్షణాలు కనిపించగానే ఒక కోల్డారిన్ మాత్ర తీసుకోండి. వీలైనంత వరకు, భోజనం చేసిన తర్వాత.
Boots
కోల్డారిన్
ప్రత్యేకంగా తయారు చేయబడిన జలుబు మాత్ర.

కూర్చోబెట్టారు. హీరో టెరికాట్ సూట్‌లో టిప్‌టాప్‌గా ఉన్నాడు. హీరోయిన్ గులాబీ రంగు నైలెక్స్ చీరలో మొగ్గలా ఉంది. అంతలో హీరోయిన్ మైక్ ముందు నిలబడి, చీర కుచ్చిళ్లు సరిచేసుకుంటూ, 'ప్రేక్షక మహాశయులారా! నేను చిత్రసీమ లోకి ఎలా ప్రవేశించానంటే...' అంటూ మొదలుపెట్టింది. నా చెవులకి ఆ మాట లేమి వినబడటంలేదు. హీరోయిన్ అందాన్ని కళ్ళప్పగించి చూస్తున్నాను.

స్పీచ్‌లో మధ్య నా పేరు విని ఉలిక్కిపడ్డాను. అవును. సందేహం లేదు. 'చంద్రశేఖర్' అని స్పష్టంగా అంటూంటేనూ!

'నాకు సౌజన్య చెప్పింది. 'మా వారు ఈ ఊళ్లోనే ఉన్నారు. నీ సినిమాలంటే పడి చస్తారు. మొదటిరోజు మొదటి ఆటకి రాకుండా మానరు' అని. దయచేసి 'చంద్రశేఖరుగారు వచ్చి ఉంటే ఒక్కసారి వేదిక మీదకు రావలసిందిగా ప్రార్థిస్తున్నాను. నన్ను అంతగా అభిమానించే ఆయనని, మా సౌజన్య భర్తగారిని చూడాలని ఉంది. దయచేసి 'చంద్రశేఖర్'గారిని వేదిక మీదకు రావలసిందిగా కోరుతున్నాను' హీరోయిన్ ఉపన్యాసం ఆపేసి హాలులో నాలుగువైపులకి పరికించి చూస్తోంది. హాలంతా సూది పడితే వినపడేంత నిశ్శబ్దం ఆవరించుకుంది.

'చంద్రశేఖరంగారూ, ప్లీజ్' మళ్ళీ అభ్యర్థించింది హీరోయిన్.

నేను లేచి నిలబడ్డాను. ఏ శక్తి అలా లేచి నిలబెట్టించిందో నాకే తెలియదు. అందరూ నన్నే చూస్తున్నారు. ఆ చీకట్లో అందరి మొహాల్లోనూ తాండవిస్తున్న ఈర్ష్యా భావాన్ని గమనించలేనంత వెర్రివాణ్ణి కాను నేను. వేదికమీదనుంచి హీరోయిన్ నన్నే చూస్తోంది. అడుగులో అడుగు వేసుకుంటూ వేదికదాకా నడిచాను.

'వాట్ ఎ హేన్సమ్ పర్సనాలిటీ! పైకి రండి' తీయగా ఆహ్వానించింది నా అభిమాన నటి. చెక్కమెట్లు ఒక్కొక్కటే ఎక్కుతున్నాను. చివరి మెట్టు మీద కాలు పెట్టగానే ఫెళ ఫెళ లాడుతూ విరిగిపోయింది ఆ చెక్కమెట్టు. అంతే! దొర్లుతూ క్రిందకు జారిపోయాను. కెవ్వుమంది హీరోయిన్, అంతా రణగొణ ధ్వని.

# మాగ్నెట్

దబ దబ బాదుతున్న తలుపు చప్పుడికి ఉలిక్కిపడి లేచి కూర్చున్నాను. నేను నా గదిలోనే మంచం మీద ఉన్నాను. బయట ఎండ తీక్షణంగా ఉంది. అంటే ఇదంతా పగటి కల అన్నమాట! మరి తలుపు బాదినట్లు చప్పుడో? ఆ అనుమానం తీర్చడానికన్నట్లు మళ్ళీ ధన ధన మని తలుపుల మీద శబ్దం అయింది. ఆవలించుకుంటూ వెళ్ళి తలుపు తెరిచాను. బయట చంద్రం నిలబడి ఉన్నాడు. ఎక్కడెక్కడ తిరిగాడో మొహం ఎర్రగా కంది ఉంది. ఉంగరాల జుట్టు నుదుటిమీద అందంగా పరుచుకుంది.

## ఏం సాధించాం పాతికేళ్లలో?

స్వాతంత్ర్యం వచ్చి పాతికేళ్ళు నిండింది.
భారతవీర చరిత్ర కూడా అక్కడే ఆగిపోయింది
'మా తాతలు నేతులు తాగారు
మా మూతులు వాసన చూడండి' అంటూ
ఏ పేటా చంకలు కొట్టుకోవడం
కవులూ, గాయకులూ, గొంతు చించుకుని
వేదికల మీద ఏడాదికొకసారి గతాన్ని మననం
చేసుకోవడం తప్ప,
మనం సాధించింది ఏముంది ఈ పాతికేళ్లలో?
చెప్పుకోవడానికి ఏం మిగిలింది ఇంకా మనలో?
ఎటు చూసినా అశాంతి
ఏం చేసినా అసంతృప్తి
న్యాయానికి స్థానం లేదు.
నిజాయితీకి విలువ నీడ లేదు.
అధిగమిస్తున్న ధరలనందుకో లేక,
ఆకలి మంటలు ఓర్చుకో లేక,
అన్యాయాలు, అక్రమాలు చేసే
ప్రజా వాహిని నాపలేక పోతున్నాం.
అదుపులోపెట్టి అన్నిటినీ కూర్చలేకపోతున్నాం.
ఏకమత్యం పేరిట అనేక ప్రసంగాలు చేస్తూ
పార్టీలను పెట్టి అందంగా పోట్లాడుకుంటున్నాం
కక్ష్యలు పెంచుకుంటూ
లక్ష్యాలు మరచి పోతూ వున్న
మానవాళిని మార్చలేక పోతున్నాం.
ఇదేనా మనం సాధించింది ఈ పాతికేళ్లలో?
ఇంకేం చెప్పుకుంటాం ముందు ముందు
రాబోయే ఏళ్లలో?
గతాన్ని వల్లె వేసుకోవడం తప్ప!!

—శారదా అశోకవర్ధన్

'ఉగ్రవా? ఏదయినా మింగావేమోనని హడలి చచ్చాను. పగలు అంత మొద్దు నిద్ర ఏమిటిరా?' ముందరిస్తూ నన్ను తోసుకుని లోపలికి వచ్చాడు.

'సరీ, అది సరేగానీ నువ్వు ఐదు నిముషాల్లో వస్తానని ఇప్పుడా రావడం?' అన్నాను మంచం మీద కూర్చుంటూ.

కుర్చీ మీద కూర్చున్న చంద్రం బూటు కాళ్ళని కిటికీ మీద పెడుతూ, 'ఏం చేయను. నేను హాస్పటల్‌కి వెళ్ళగానే పెయిన్స్ వచ్చాయి. సరిగ్గా గంట క్రితం డెలివరీ అయింది. మగపిల్లవాడు' మామూలుగా అనేసినా వాడి మొహంలో ఒక విచిత్రమైన దర్పం తొంగి చూసింది. నా పెళ్ళికి సరిగ్గా సంవత్సరం ముందే వాడి పెళ్ళి జరిగింది. అంటే పెళ్ళయిన ఏడాదిన్నరకే తండ్రి అయ్యాడన్న మాట!

'ఎవరికి? నీకా మీ ఆవిడకా?' జోకు జోకేనని అనుకున్నాను.

చంద్రం మాత్రం మొహం చిట్లించి, 'పరిహాసాలు తరవాత ముందు ఈ సంగతి చెప్పు, పిల్లాడు 'మఖ' నక్షత్రంలో పుట్టాడు. నేను పిల్లాడిని చూడడానికి ఏమైనా అభ్యంతరం ఉంటుందా? శాంతి చేయించుకోవడం లాంటి తతంగం ఏమైనా ఉంటుందా' తిన్నగా కూర్చుంటూ అడిగాడు.

'ఇది మరీ బాగుంది, నాకేం తెలుసు. నేనేమన్నా 'శాంతులు' చేయించేవాడినా. అది తెలిసినా బాగానే ఉండును. నీలాంటి చదువుకున్న క్రూరవాళ్ళ దగ్గిర బాగా వేగడించవచ్చు' అన్నాను నేను.

'ఆవహోయ్ నీ సావ! ఏదో బ్రాహ్మణుడివి కదా తెలుసుంటుందని అడిగాను. ఏ పురోహితుణ్ణి అడిగి రూపాయి పారేస్తే చెబుతాడు' లేచి నిలబడ్డాడు చంద్రం.

'ఆ చేత్తోటే నా మొహాన కూడా పదో, పదిహేనో పారేయ్. నీకు చూసుకుని వడ్డీతోసహా చెల్లిస్తా' సందులో సందని అడిగాను.

'ఇంకా వడ్డీ వ్యాపారం మొదలుపెట్ట లేదులే చిల్లరనోట్లు ఉన్నాయో లేవో'. టెరికాట్ పాంట్ జేబులోంచి ఫళ ఫళ లాడుతూన్న ఖరీదైన పర్సు పైకి తీశాడు చంద్రం. రెండు వందరూపాయల నోట్లు, ఒక ఇరవైరూపాయల నోటు, ఒక ఐదు నోటు, నాలుగైదు చిల్లరనోట్లు ఉన్నాయి.

ఇరవైరూపాయల నోటు నా చేతికిస్తూ 'చాలా?' అని అడిగాడు. చాలన్నట్లుగా తల ఊపాను. చంద్రం దగ్గిర ఉన్న సుగుణం అదే. డబ్బుందని అహంభావం లేదు. అడగ్గానే ఎందుకు? ఎప్పుడిస్తావు? అనే ప్రశ్న అడగకుండానే ఇచ్చేస్తాడు. ఇచ్చి నప్పుడే తీసుకుంటాడు. ఈ లోపల ఇమ్మని వత్తిడి చేయడు.

'వెళ్తొస్తా'నని చెప్పి స్కూటర్ మీద వెళ్ళిపోయాడు చంద్రం. చేతిలో ఉన్న ఇరవైరూపాయల నోటు గాలికి రెప రెప లాడుతోంది. 'ఫరవాలేదు. ఈ ఇరవై రూపాయలతోటి పది రోజులు గడిపేయ వచ్చు. ఈ లోపులో నా కథ డబ్బు రాక పోదు' మనసులోనే అనుకున్నాను-(అన్నట్లు నేను 'రచయిత'నని మీకు చెప్పలేదు కదూ. సారీ, అప్పుడప్పుడు చేయి దురద పెడితే ఏదో గోకిపారేస్తూ ఉంటా లెండి!) ఇరవైరూపాయల నోటుని సాయంత్రం సిని మాలో మార్చే ఉద్దేశ్యంతో హేంగర్‌కి తగిలించి ఉన్న పాంట్ బాక్ పాకెట్‌లో పెట్టాను.

* *

ఫస్ట్‌డే సినిమాహాలు దగ్గిర జనం కొట్టుకొంటున్నారు. అంత రష్ని చూడటం నా జీవితంలో మొదటిసారి. హైక్లాస్ క్యూలో నిలబడ్డాను. అది తప్ప మరేదీ దొరకదు. దానికే హనుమంతుడి తోకలా ఉంది క్యూ. ఆడవాళ్ళకి ముందు ఇస్తున్నారు టిక్కెట్లు. ప్రతి చోట 'లేడీస్ ఫస్ట్' అనే పేరుతో అన్యాయం జరిగిపోతోంది. కొన్నాళ్ళు పోయాక మన మంతా 'జెంట్స్ ఫస్ట్' 'పురుషులకు స్త్రీలతో సమానంగా హక్కులుండాలి' అనే నినాదాలు చేయవలసి వస్తుందేమో ? చిన్న సైజు ముష్టియుద్ధం తరవాత టికెట్ దొరికింది. అప్పటికే న్యూస్‌రీల్ బిగిన్ చేసేశారు. హౌస్‌ఫుల్ అయిపోయింది. ఎక్స్‌ట్రా కుర్చీలు వేసేశారు ఎలాగో తంటాలుపడి ఒక ముసలి ఎక్స్‌ట్రా కుర్చీని సంపాదించుకోగలిగాను. తీరా కూర్చు న్నాక అది అటూ ఇటూ కదలడం మొదలు పెట్టింది. దానికితోడు ముందు దగ్గరగా కుర్చీలు వేసేసారేమో కాళ్ళు జాపుకోవడానికి వీలు లేకపోయింది. అలాంటి కుర్చీలో ముడిచిపెట్టుకుని ఎలా కూర్చుం టాం? పోనీ కుర్చీ మార్చుకోవాలన్నా వీలు లేకుండా నాకు రెండు ప్రక్కలా, వెనకాల,









# మాగ్నెట్

ముందూ అన్నీ ఎక్స్‌ట్రా క్వీలు. అదీ గాక సినిమా కూడా మొదలయిపోయింది. ఏం చేస్తాం? వచ్చినట్టు చూడాలి.

ఎంతో బాగుంటుందని ఎక్స్‌పెక్ట్ చేసిన ఆ సినిమా పరమ బోరుగా ఉంది. ఈ మధ్య ప్రతిసినిమా ఇలాగే అవుతోంది. చాలా బాగుందన్న పత్రికల వ్రాతలని చూసి మొదటిరోజు పరిగెత్తడం ఇంటికెళ్ళగానే ఒక ఏస్ప్రో బిళ్ళవేసుకుని, ఇంత టీ త్రాగి, భోజనం చేయకుండానే పడుకోవడం. మళ్ళీ క్రొత్త సినిమా రిలీజవగానే బాగుంటుందనుకుని బయలుదేరడం.

హీరోయిన్ ధనవంతుల బిడ్డ. హీరో కటిక దరిద్రుడు. ఇద్దరిమధ్య ప్రేమ అంకురించింది. ఎలా ఆ ప్రేమ పుట్టిందో సరిగా కారణం కల్పించలేని సినిమా రచయిత హీరో, హీరోయిన్ల ఇద్దరిచేతా 'ప్రేమ గుడ్డిది' అని ఒక డైలాగ్ పలికించి సరిపుచ్చాడు. కాని చూసేవాళ్ళు గుడ్డివాళ్ళు కాదు కదా! ఇక హీరోయిన్ 'రావోయి నారాజా!' అనే టైటిల్ సాంగ్‌తోపాటు కుప్పిగంతులువేస్తూ హీరోని జూలాజికల్ పార్కునుంచి, బృందావన్‌గార్డన్స్‌కి అక్కడినుంచి ఊటీకి తరవాత కాశ్మీర్‌కి తెగ తిప్పేసి చివరకి తిరుపతి కొండకి చేర్చింది. (ఈ చిత్ర నిర్మాతకూడా ఆఖరికి అక్కడికే చేరుకోవాలేమో?)

'ఈ పెళ్ళి జరగటానికి వీల్లేదు' క్లోజప్‌లో శాసించాడు హీరోయిన్ తండ్రి. అదొక్కటే ఆ ఏక్‌స్ట్రా ఏక్టర్ క్లోజప్ సీన్.

'ఆయనే నా దైవం. ఆయనతోటే నా లోకం' అంటూ హీరోయిన్ హీరోతో కట్టుబట్టలతో బయలుదేరింది. ఆ దరిద్రపు హీరోతో గుడిసెల్లో కాపరముంటూ 'గృహమే స్వర్గసీమ' అంటూ డ్యూయట్ పాడుతూ, పాట ముగిసేలోపల ఇద్దరు పిల్లల తల్లి అయింది. హీరోకి ఏ ఉద్యోగం దొరక్క, హీరోయిన్ని దాని ఖర్మకి దాన్ని వదిలేసి వెళ్ళి మిలటరీలో చేరాడు. ఇక హీరోయిన్ పాట్లు మొదలయ్యాయి. ఒకరోజు ఇంట్లో బియ్యంలేవు. అన్నం వండలేదు. చిన్నపిల్లలిద్దరూ 'అమ్మా ఆకలి' అని ఏడుస్తూ హీరోయిన్ కొంగు లాగారు. హీరోయిన్ ఏడుస్తూ కూడా గ్లామర్ కురిపించేసింది. అబ్బాయి మినియం గిన్నె మూత తీశాడు హీరోయిన్ చిన్నకొడుకు. అంతే! పాత్ర దద్దరిల్లే శబ్దంతో ఖాళీ గిన్నె క్లోజప్‌లో కనిపించింది. 'అన్నం కావాలి' అంటూ ఇద్దరు పిల్లలు ఏడుపు లంకించుకున్నారు. హీరోయిన్ కెమెరావైపు చూస్తూ కుమిలిపోతోంది.

'అన్నం లేకపోతే ఏడవడం ఎందుకు గాన్నా? మనం తిన్నట్టు బొన్నరొట్టి తిని ఉండవచ్చుకదా!' నా వెనకనుంచి చిన్న పిల్లాడి కంఠం వినిపించింది.

'నోరు మూసుకుని సినిమా చూడవోయ్' అని కసురుకున్నాడు ఆ పిల్లాడి తండ్రి! ఆ కంఠాన్ని నేను పోల్చుకోగలిగాను. అది... ఉమాపతిది! ప్రొద్దున్న డబ్బు అప్పు అడిగిన ఉమాపతిది! పిల్లలని బొన్నరొట్టి తిని ఉండమన్న ఉమాపతిది! పిల్లలకి బట్టలు, భార్యకు చీరలూ కొనలేని ఉమాపతిది! ఇంట్లో పట్టుమని పాతిక రూపాయలు విలువచేసే సామానులేని ఉమాపతిది! హైయ్యెస్ట్ క్లాస్ టికెట్లుకొని ఫామిలీతోసహా పిక్చర్ రిలీజైన రోజే వచ్చి చూస్తున్న ఉమాపతిది!

నాతల గిర్రున తిరిగిపోతోంది. ఇది ఎక్కడి వెర్రితనం. తిండానికి లేకపోయినా సినిమా అవసరమొచ్చిందా? ఈ డబ్బుంటే నాలుగురోజులు ఏ ఇబ్బందీ లేకుండా గడిచిపోయేదా? లేకపోతే పిల్లాడికో జతబట్టలు రావా? ఇంట్లోకి సామాను సినిమాలు మానేస్తే సమకూరవా? ఇదెక్కడి అవివేకం? కడుపు కాలుతూండగా అప్పుచేసి మొదటిరోజు ఇంటిల్లిపాది సినిమా చూడాలా?

'మరి నువ్వుచేస్తున్న పని ఏమిటి?' హేళనగా అడిగింది అంతరాత్మ. 'నువ్వు అప్పుచేసి మొదటిరోజు చూడటంలేదా?'

'నా సంగతి వేరు' వసిగాను నేను.

'అంతా ఒకటే! నువ్వూ ఇంట్లోకి బియ్యానికి లేకపోయినా అప్పుచేసి, ఫస్ట్ క్లాస్‌లో కూర్చుని చూస్తున్నావు సినిమా!'

'వాడు నలుగురు పిల్లలున్నవాడు. మరి నేనో?!'

'ఎల్లకాలం ఇలాగే ఉంటావా? ఇప్పుడు ఇలా అంటావు. పెళ్ళయ్యాక పిల్లలు పుట్టాక మానేయగలవా? మానలేవు. వాళ్ళుకూడా ఉపాధిలేని పిల్లలలాగా ఒంటి మీదా బట్టా, కడుపునిండా తిండిలేకుండా అవస్థపడతారు. ఇప్పుడు చలాకీగా, ఆరోగ్యంగా, పుష్టిగా ఉన్న సౌజన్య చిరిగిన చీరలలో చిక్కి శల్యమై నీరసంగా ఉంటుంది. కాని ఫస్ట్‌షో టైమ్ అవగానే అప్పుచేసైనా అంతా వెళ్ళిపోతారు. ఇంటికి పోతారు. ఇంటికివచ్చి కాలే కడుపులతో పడుకుంటారు.'

'అవు, అవు, ఇంక ఏమీ మాట్లాడకు. అంతా అర్థం అయింది. ఈ సినిమా అనేది ఒక మాగ్నెట్ లాంటిది. అందర్నీ ఆకర్షించడమే దానిపని. కాని వస్తువు పరిధిలో ఉన్నప్పుడే దానికి ఆకర్షించే శక్తి ఉంటుంది. దాని పరిధి దాటిపోతే దానిని అది ఏమీ చేయలేదు. నేనుకూడా ఈ సినిమా అనే మాగ్నెట్ పరిధినుంచి తప్పించుకుంటాను. జీవితాన్ని సుఖవంతం చేసుకుంటాను. వినోదానికి పార్కులు, బీచ్, లైబ్రరీలు ఉండనే ఉన్నాయి. అంతగా అయితే మంచి సినిమాలు చూడవచ్చు. రిలీజైనవన్నీ చూడనక్కరలేదు' ఇలా నేను ఒక నిశ్చయానికి వచ్చేసరికి హాల్లో లైట్లు వెలిగాయి. తల వంచుకుని గబగబా బయటకు వచ్చేశాను.

బస్టాప్ రష్‌గా ఉంది. క్యూలో చివర ఉన్నాను నేను. మూడు బస్సులు వెళ్ళిపోయాయి. బస్టాపులో జనం పలచబడ్డారు. చుట్టూ చూస్తూ ఉండగా గోడమీదఉన్న ఒక పోస్టరు నా దృష్టి నాకర్షించింది. దగ్గరకువెళ్ళి చూశాను. సందేహం లేదు. అది హిట్ పిక్చరు. నేను రెండుసార్లు మిస్ చేసిన హిందీ పిక్చరు. అంతక్రితం రిలీజుల్లో దాన్ని చూడలేకపోయాను. ఈ మారైనా తప్పకుండా చూడాలి. మార్నింగ్‌షో మాత్రమేట! రేపు శివరాత్రి కాబట్టి సెలవు. తప్పకుండా వెళ్ళాలి. ఇన్నాళ్ళకి నా చిన్నాళ్ళకోరిక నెరవేరబోతోంది.

ఇంతదుమ్ము మొహాన కొట్టి ముందు వెళ్ళిపోయింది సిటీ బస్సు. ఆలోచనలతో పడి నేను గమనించలేదు. బస్సు మిస్‌చేసినందుకు నేను విచారించలేదు. పైపెచ్చు మిస్‌చేసిన సినిమాను చూడబోతున్నందుకు ఆనందిస్తూ, ఆ వాల్ పోస్టర్ వైపు తృప్తిగా చూస్తూ నిలుచున్నాను. ●

# వారఫలం

## 17-8-1973 శుక్రవారం మొదలు 23-8-1973 గురువారం వరకు

**మేషం:—** చేజిక్కిన అవకాశాలు కూడా జారి పోవచ్చును. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వారం మధ్యలో అన్ని వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణాలు ఫలించగలవు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

**వృషభం:—** వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది. వారం మధ్యలో చికాకులు యేర్పడతాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు అనుకొన్నట్లుగా నెరవేరతాయి.

స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మిధునం:—** అన్ని వ్యవహారాల్లోను గౌరవం లభిస్తుంది. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి. మీ ప్రయత్నాలు ఫలించగలవు. వారం ఆఖరులో సహాయం చేస్తామన్నవారు సమయానికి తప్పుకోవచ్చును.

స్త్రీలకు — దైవకార్యాలు నెరవేరతాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతిలభిస్తుంది.

**కర్కాటకం:—** రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. ప్రయాణాలు ఫలిస్తాయి. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి. వారం ఆఖరులో మీరు యిదివరకు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి.

స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. శుభ కార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**సింహం:—** మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం మధ్యలో వ్యాపారంలోఅనుకూల వార్తలను వింటారు. విద్యావైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. అన్ని వ్యవహారాల్లోను గౌరవ ప్రాబల్యాలు బాగుంటాయి.

స్త్రీలకు — కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**కన్య:—** వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. పోటీవారిలో గౌరవం బాగుంటుంది. వారం మధ్యలో ఆందోళన కలుగుతుంది. ఏ వ్యవహారంలోను సాహసించడానికి వీలులేని సమయం. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి.

స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు. ప్రయాణాలోచనలు చేస్తారు.

**తుల:—** మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. పోటీవారితో వాదప్రతివాదాలు తగవు. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు లాభిస్తాయి. ఆర్థిక వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. వారం ఆఖరులో మీరు వెనుకకు తగ్గడమే మంచిది కాగలదు.

స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. దైవకార్యాలు నెరవేరతాయి.

**వృశ్చికం:—** మున్ముందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధించగలరు. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. ప్రయాణాలు స్వల్పంగా ఫలిస్తాయి. వారం ఆఖరులో మీ ఆలోచనలు ప్రయోజనకరంగా ఉంటాయి.

స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్యకరంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**ధనుస్సు:** మీ కార్యక్రమాల్లో అడావుడి అధికంగా ఉంటుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. నూతన వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో మీరు అనుకొనేది ఒకటి జరిగేది మరొకటి కావచ్చును.

స్త్రీలకు — బంధువులకు సహాయం చేస్తారు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మకరం:—** వ్యాపారంలో పోటీవారి పోటీ తగ్గుతుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. ఇతరుల నిమిత్తం చేసే ప్రయత్నాలు సులువుగా నెరవేరతాయి. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి.

స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. అనుకూల వార్తలను వింటారు.

**కుంభం:—** మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. వారం ఆఖరులో మీ మంచితనమే మీకు కొన్ని వ్యవహారాల్లో మీకు యిబ్బందిని కలిగిస్తుంది.

స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. పోటీవారిలో గౌరవం లభిస్తుంది.

**మీనం:—** వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. సమయానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికి వస్తుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి.

స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. విలాస వస్తువులు కొంటారు.

—మహేష్




CHAITRA-BLS 8 TEL




**జరిగిన కథ**

రమణమూర్తి, శేఖర్ బాల్య స్నేహితులు. రమణమూర్తి ఒక కంపెనీలో పని చేస్తున్నాడు. శేఖర్ స్టేట్స్‌కి వెళ్ళి భార్య సుమతితో పది ఏండ్ల తర్వాత ఇండియాకు వచ్చి రమణమూర్తిని చూడ్డానికి వచ్చాడు. రమణమూర్తి భార్య ఇందిర, సుమతి ఇద్దరూ ప్రాణ స్నేహితులు. శేఖర్‌కి పేకాటపిచ్చి. రమణమూర్తికీ అలవాటు చేశాడు. శేఖర్ రిజైన్‌చేసి హైదరాబాదు మారడానికి ప్రయత్నాలు చేశాడు. మామగారు పోవడంతో నెల్లూరు బయల్దేరింది ఇందిర పిల్లలతో. తండ్రి రమణ పేరుతో విలు నామా రాయడం వాళ్ళమందికి కష్టం కలిగించింది. మిగిలిన వ్యవహారాలని లాయర్‌గారికి అప్పగించి వెళ్ళిన శిరీష్‌ని తీసుకుని తిరిగి వచ్చాడు రమణ. శేఖర్, సుమతి వెళ్ళిపోయాక ఇందిర ఒంటరిగా ఉంది. రాజారావుని ప్రేమించింది శిరి. ఇందిర ఆమెకి వదిన. వదినతో రాజారావు విషయం చెప్పింది. విజయసారధి, శిరీష్‌రాణికి స్నేహితులయ్యారు. చాలకాలం తర్వాత శేఖర్, రమణ మళ్ళీ ఉల్లాసంగా కలుసుకున్నారు. శిరి ప్రవర్తన విజయసారధిని బాధించింది.

# 14

ఆ రాత్రి శిరి బాధా—వేదనలు చూపి జడిపి నిద్రాదేవి దరిచేరలేదు. తెల తెల వారుతుండగా కళ్ళు మంటలకు దిళ్ళు చాటు చేసుకుని కళ్ళుమూసిన శిరి బాగా పొద్దెక్కిన తరువాత లేచింది.

'ఏమ్మా! రాత్రి నిద్రపట్టలేదా? మొహం అలా వాడి పోయిందేం!' ఇందిర ఆప్యాయంగా పలకరించి కాఫీ కప్పు అందించింది. వదిన వంక చూసి నవ్వుగా నవ్వి తల దించుకున్నది శిరీష్.

'ఏ వయస్సులో జరిగే ముచ్చట ఆ వయస్సులో జరగాలంటారు పెద్దలు అందుకనే—పొంగే వయస్సులో రాత్రులు వంటరిగా గడపటం దుర్భరం కాదూ? అందాల రాకుమారులు కళ్ళ ముందు కదులుతూ. కంటికి కునుకు రానియ్యరు మరి' ఇందిర శిరి మొహంలోకి చూసి నవ్వింది.

వదిన హాస్యానికి తనూ నవ్వుతూ,

'నీ ముచ్చట త్వరగానే తీరుతుందిలే వదినా' అని ఇందిరకు మరి మాట్లాడే అవకాశం ఇవ్వకుండా అక్కడి నుండి లేచి తన గదిలోకి వెళ్ళింది.

హాస్పటల్‌కు వేళకు వెళ్ళిందేగాని, శిరి మనస్సు మనస్సులో లేదు. డ్యూటీలో నిమగ్నురాలు కాలేకపోయింది. సారధి కనిపిస్తాడు. తన నిర్ణయం చెప్పాలి, అతడెంత సంతోషిస్తాడో — తనకంత బాధ కలుగుతుంది. అయినా తన శ్రేయస్సు కోరే వారి కోసం—తనీ బాధ నిండు మనస్సుతో స్వీకరిస్తోంది. అందుకే రాత్రల్లా ఆలోచించి ఈ నిర్ణయాని కొచ్చింది. వింతటి వాళ్ళు, విధికి తలొంచవలసిందే. తన నుదుట ఇలా రాసి వున్నప్పుడు తప్పించటం ఎవరితరం? బరువుగా నిట్టూర్చి—టేబుల్ మీద తలవాల్చుకుని కళ్ళు మూసుకున్నది. స్టాఫ్ నర్స్ వచ్చి రెండు సార్లు పిలిస్తే ఉలిక్కిపడి కళ్ళువిప్పిచూసి ఏమిటన్నది.

'సారధిగారు మీకోసంవచ్చి వెయిట్ చేస్తున్నారు' చెప్పింది నర్స్.

'రమ్మని చెప్పు' నర్సుకు చూస్తూ అన్నది.

సారధివచ్చి విష్‌చేసి కూర్చున్నాడు. పని లంచాలు తీసినట్టుగా శిరి మొహం అంతా పీక్కుపోయి—ఆందోళనగా వుంది— రాత్రల్లా నిదురలేదని ఆ ఎర్రబడిన కళ్ళు చూస్తేనే తెలుస్తోంది. అతణ్ణిచూసి శిరి పెదవులమీద చిరునవ్వు విరిసి మాయమై పోయింది. ఆమెవంక చూడలేక తలదించుకు కూర్చున్నాడతను. శిరి నోటమాట రావటం లేదు. మామూలు మర్యాదలు కూడా ఇద్దరు మరిచారు. గదిలో నిశ్శబ్దత అలముకున్నది. ఏ మొదగాలో — ఏం చెప్పాలో ఇద్దరూ మరిచినట్లు—మాటలే రానట్లు— ఏమో చెప్పాలని తపన, ఏమీ చెప్పలేని నిస్సహాయత-ఆందోళన, ఇద్దరి మొఖాల్లోనూ ద్యోతకమవుతూంది.

అంతలో నర్సువచ్చి డీనగారు సారధిని పిలుస్తున్నారని చెప్పటంతో స్తంభించిన వాతావరణంలో చైతన్యం కలిగింది.

అతడు వెళ్ళటానికి లేచి నిల్చుని, శిరి కళ్ళల్లోకి ఆశగా చూశాడు. అతడి చూపులు తప్పించుకుంటూ,

'సాయంత్రం మా ఇంటికి వెళ్దాము రండి, మా వాళ్ళకు పరిచయం చేస్తాను' వణికేగొంతు అదుపులో పెట్టుకుంటూ— ప్రయత్న పూర్వకంగా ఒక్కొక్క అక్షరమే పలుకుతూ శిరి అన్నమాటలు, అతడి కర్ణపుటాలకు వీణాస్వనాలై తాకి—ఆ మాటల్లో అర్థం గ్రహించి, పట్టలేని ఆనందంతో— ఒక్కవుదుటన శిరి ముందుకు వచ్చి నిలబడి

'నేను—నేను అదృష్టవంతుణ్ణి—నాకు తెలుసు నా ఆరాధన వ్యర్థంకాదని—ఈ రోజు ఎంత మంచిరోజు—నా కోరిక సఫలమైన సుదినం' మాటలు తడబడగా — ఆనంద

బాష్పాలతో తడిసిన కళ్ళు మెరుపులీనుతూ వుత్సాహంగా అతనంటూ వుంటే - శిరి విభ్రమంగా చూసి — అంతలోనే తెప్పరిల్లి, 'డాక్టరుగారూ—కాస్త ఓర్పు వహించండి— ఇది హాస్పటల్—మన ఇల్లు కాదు. ఎవరో పిల్చేరుట ముందా పని చూడండి' అన్న శిరి మాటలకు అంతటి మగవాడు సిగ్గుపడి— శిరినుండి చూపులు బలవంతాన తిప్పుకుంటూ—'సాయంత్రం కలుస్తాను' అని గాలిలో తేలుతున్నట్లు వెళ్తున్న అతణ్ణి చూసి, మూగపోయిన మనో మురళి సున్నితంగా మోగినట్లు గుండె అదిరింది శిరికి. రెండుచేతులతో గుండె రాచుకుంటూ— 'భగవాన్ రాబోయే పరిణామానికి నీదే బాధ్యత' నిట్టూర్చింది సన్నగా—

ఆ సాయంత్రం శిరితో పాటుగా వచ్చిన ఆ కొత్త యువకుణ్ణి చూసి విస్తుపోయిన ఇందిరకు తనకు సీనియర్‌గా పరిచయం చేసింది శిరి. శిరి 'కో' డాక్టరుగా మర్యాద చేసి—కాఫీ, టిఫిన్ ఇచ్చి ఏవో కుశల ప్రశ్నలు వేసింది. ఇంకేమి మాట్లాడాలో ఇందిరకు తోచలేదు. అతడూ బిడియంగా దిక్కులు చూస్తూ కూచున్నాడు. అతడి మౌనాన్ని చూసి, డాక్టరుగారి వుత్సాహము — ఆవేశపూరితమైన ఆకబుర్లు — ఆ నవ్వులు ఏమైనాయా, ఆడపిల్ల కన్నా ఎక్కువ సిగ్గుపడుతున్నాడే—అని శిరి తనలో తను నవ్వుకున్నది. రమణ ఆఫీసు నుండి ఇంతకీ రాకపోవటంతో — ఇక వెళ్తానని లేచాడు సారధి. గేటు దాకా సాగనంపి లోపలకు వచ్చిన శిరిని ఇందిర ఏమీ అడుగలేదు వదిన అడిగితే చెప్పాలనుకున్న శిరికి ఆశాభంగమై — అయినా తప్పదన్నట్లు — వంట గదిలో పని చూసుకుంటున్న ఇందిర పక్కన చేరి,

'వదినా' అన్నది మెల్లిగా.

ఏమిటన్నట్లు తల తిప్పిన ఇందిర వైపు చూడటానికి సిగ్గుపడి తలవొంచుకుని, 'వదినా సారధిని చూశావుగా—నీ అభిప్రాయమేమిటి?' అన్నది.

'అభిప్రాయానికేమిటి? మంచివాడు — మర్యాదస్తుడులాగనే వున్నాడు. అయినా ఒక్కసారి చూసి అతణ్ణి గురించి ఏమేం చెప్పను? అంత శ్రద్ధగా పరిశీలించాల్సిన అవసరం మాత్రం ఏమి వున్నది?'

'అవసరం వున్నది కనుకే అడుగుతున్నాను'

'ఏమీ?' ఆశ్చర్యపోయింది ఇందిర.

'అందుకే ప్రత్యేకంగా మనింటికి తీసుకొచ్చాను.'

ఇందిర కళ్ళు వెడల్పు చేసుకుని మరీ చూసింది శిరి వంక 'అవును వదినా ఇదివరకోసారి 'రాజును మన ఇంటికి తీసుకు రమ్మన్నావు గుర్తున్నదా? అప్పుడు అతడూ



రావటానికి నిరాకరించారు. ఇప్పుడు ఇతడు తనకై తాను కోరి మనింటికి వచ్చాడు. నీకు పరిచయం చేశాను. అన్నయ్యకు చెప్పి తక్కిన విషయాలు చూచుకొనే బాధ్యత నీది—మీ అభిప్రాయాలకి నేను కట్టుబడి వుంటాను'

ఇందిర గబుక్కున శిరిని కౌగలించుకున్నది. 'ఎంత మంచి మాట విన్నాను శిరీ—నాకు చాలా సంతోషంగా వున్నది. బంగారు తల్లివి, ఇన్నాళ్ళకయినా నీ మంచి నీవు తెల్సుకున్నావు, భగవంతుడు నీకు సర్వదా సుఖం కలిగిస్తాడు. ఇంత మంచి మాట ఇంతసేపు ఎల్లా దాచుకున్నావు




# చరితార్థులు

అప్పుడే చెప్పలేదేం? ఏడిపిద్దామనుకున్నావా?' శిరి బుజాలు పట్టి వూపుతూ గబగబా ఏదో అంటున్న ఇందిర చేతులు తప్పించుకుని గదిలోకి పరిగెత్తింది శిరీష్, ఎప్పుడెప్పుడు భర్తకు ఈ వార్త చెప్పుదామా అని, ఎదురుచూడ సాగింది ఇందిర.

రమణ ఆఫీసునుండి వచ్చేసరికి చాలా పొద్దుపోయింది. అప్పటికే పిల్లలంతా అన్నాలు తిని నిద్రపోయారు. రమణను చూస్తూనే ఈ వార్త చెప్పి వేద్దామనుకున్న ఇందిర, అలసటగా వున్న అతడి మొహంచూసి, ఇప్పుడు కాదు స్నానం—భోజనం అయ్యాక తీరిగ్గా చెప్పవచ్చునని—కంచాలు— అవీ సర్దసాగింది.

భోజనమయ్యాక పేపరు చేతిలోకి తీసుకుని వాలుకుర్చీలో వాలిన రమణతో—

'ఏమండోయ్ ఆ వార్తలకన్న ముఖ్యమైన మంచివార్త ఒకటి వున్నది నాదగ్గిర. ఏమిటో చెప్పుకోండి చూద్దాం' అన్నది నవ్వుతూ.

'ఏమిటబ్బా అంత ముఖ్యమయినది. నీ అన్నయ్యగారు వస్తున్నాడా? నీ అక్కయ్యలకు మన ఇల్లు పావనం చేయాలన్న సద్బుద్ధి కలిగిందా?' వేళాకోళంగా అన్నాడు.

'చాలా గొప్పగా కనిపెట్టారులెండి—ఎప్పుడూ మావాళ్ళొచ్చి పోతున్నట్లే మాట్లాడుతున్నారు' మూతి తిప్పింది.

'అదే ఎప్పుడూ రానివారు రావటమే విశేషంగదా!'

'అదేంకాదు అంతకన్నా మంచివార్త—చాలా సంతోషమైన వార్త కూడాను. చెప్పలేరుకదూ? ఓడిపోయాననండి చెప్పేస్తాను!'

'నా ఓటమి నీ ముందు ఎప్పుడో అంగీకరించాను. నవ్వేస్తూతో చంపక నువ్వే చెప్పేదూ!'

'చెప్తే ఏమిస్తారు బహుమతి.'

'నా మనశ్శరీరాలు సర్వమూ ఎప్పుడో దోచుకున్నావు. ఇంక నాదగ్గిరేమివున్నది ఇవ్వటానికి. నేను చాలా బీదవాణ్ణయ్యాను. నేనే నీకు బహుమతి అంతకన్నా ఏమివ్వగలను?'

'అబ్బో చెప్పొచ్చారెండి కబుర్లు — ఏవరన్నా వింటే నవ్వగలరు."

'నవ్వరూ మరి అర్ధరాత్రివేళ ఆకాశ బంగా వాడన నేను కూర్చుంటే?'

'అయితే చెప్పనెండి' అని మూతిముడిచి, అరగంట బతిమాలించుకుని — అతణ్ణి వూరించి-ఆగి, ఆగి మాటలు తుంచుతూ—చివరికి చెప్పింది. రమణ ఆనందానికి మేర లేకపోయింది.

శిరికి చెప్పి ఒప్పించలేక — తండ్రి తనకు అప్పగించిన బాధ్యత నెరవేర్చలేకపోయానే అని ఎంతో మధనపడుతున్నాడు—'హమ్మయ్య ఇన్నాళ్ళకు శుభగడియ వచ్చింది—ఇక శిరి ఒక ఇంటిదైతే—తనకెంతో మనశ్శాంతిగా వుంటుంది. శచికి కూడా పెళ్ళీడు వచ్చింది — శిరికి కాకుండే శచికి ఎలా చేయాలా అనుకున్నాడు. ఇప్పుడా బెడద లేదు.

ఆ రాత్రి చాలా సేపటివరకూ, శిరి పెళ్ళిని గురించే భార్యా-భర్తలిద్దరూ మాట్లాడుకున్నారు. మరునాడు శిరితోపాటు హాస్పటల్ కు వెళ్ళి, విజయసారథిని చూచి వచ్చాడు రమణ. అతడిగురించి సేకరించిన వివరాలు రమణకు-ఇందిరకు ఎంతో సంతృప్తి కలిగించాయి.

* * *

మద్రాసుకు ఏభైమైళ్ళ దూరంలో వున్న ఒక గ్రామం విజయ సారథి స్వంత వూరు. అతని తాతముత్తాతలు ఎప్పుడో ఆంధ్రనుండి అక్కడికి వెళ్ళి పొలాలు కొనుక్కుని స్థిరపడ్డారు. కొద్దిపాటి స్వంత వ్యవసాయంతో మొదలుపెట్టి—క్రమంగా తరాలుగడిచే కొద్దీ—పట్టిందల్లా బంగారమై—మరింత భూమి చేకూర్చుకుని పెద్ద భూస్వాములైనారు. కానీ- విజయ సారథి తండ్రిగారి హయాం వచ్చేసరికి—వారిదశ తిరిగి క్రమంగా భూమి తరిగిపోయింది. సారథి తండ్రిగారు అడిగినవారికి లేదనకుండా—దానధర్మాలుచేసి—పెద్దలు సంపాదించిన ఆస్తినంతా ధర్మాలపేరిట వ్యయం చేసారు. ఆస్తిపోయినా—అపర కర్ణుడన్న ఘనమైనకీర్తి మాత్రం ఆయనకు నిలిచింది. సారథికి — అతడి కోరికమేరకు డాక్టరు కోర్సు చెప్పించారు. కొడుక్కు ఆయన మిగిల్చిన ఆస్తి ఆ చదువుమాత్రమే. పేరు ప్రతిష్ఠలుగల మంచివంశంగా—దయార్ద్ర

ప్రాయులుగా—వారికి గ్రామంలో తీరలేని కీర్తి వున్నది. విజయసారథి సివిల్ సర్జను చేస్తున్నప్పుడు—కొడుకు పెళ్లి చేయలేక పోయానన్న బెంగతోనే- విజయసారథి తండ్రి కీర్తిశేషులైనారు.

సారథి తల్లి కొడుకు దగ్గరే వుంటున్నది. సారథికి ఒక్క అక్కయ్య మాత్రం వున్నది. ఆమె ఎక్కడో దూరంలో అత్తవారింట వుండి మూడు నాలుగేళ్ల కొకసారి వచ్చి పోతూ వుంటుంది. సారథికి ఇద్దరు పిన తండ్రులు, ఇద్దరు మేనత్తలు వున్నారు. వారి సంసారాలు మంచిస్థితిలోనే వున్నారు. ఇంక సారథికి పెద్దగా బరువైన బాధ్యత లేమీలేవు.

రమణ స్వయంగా ఆవూరు వెళ్లి వారి కుటుంబ స్థితిగతులు— వంశ సంప్రదాయం అన్నీ తెల్సుకుని తృప్తిపడ్డాడు.

సారథి తల్లి వృద్ధురాలు — పూర్వాచారాలు—వంటబట్టినావిడే అయినా—సహృదయత—సంస్కారం కలిగిన దొడ్డ ఇల్లాలు—

రమణవచ్చి అడిగినదే తడవుగా—ఎంతో సంతోషంగా సమ్మతించారావిడ — కొడుకు తానై కోరుకున్న అమ్మాయి అని తెలిసి మరింత సంబరపడ్డారు. పిల్లను తను చూడనక్కర్లేదని కూడా అన్నారావిడ. కాని- రమణ బలవంతంవల్ల లాంఛనంగా వెళ్లి శిరీష్ను చూసి ముచ్చటపడ్డారు. కొడుకు ఎన్నిక ఎంత గొప్పదో తెల్సుకని— అందాల అపరంజి బొమ్మ తనింటికోడలు కావటం ఆమెకెంతో తృప్తి - ఆనందము కలిగించింది, రమణ — ఇందిరా వారిపట్ల చూపిన మర్యాద మన్ననలకు ఎంతో మురిసి పోయారు.

రమణ కట్నాల ప్రసక్తి తెస్తే—ఎంతో నొచ్చుకుని,

'లక్ష్మీదేవి లాంటి మీ అమ్మాయే మాకు లక్షరూపాయల కట్నం పెట్టు— అబ్బాయితో సమంగా చదువుకుని వుద్యోగం కూడా చేస్తున్నది. అది చాలనట్లు ఇంకా కట్నం కూడా కోరటం— మమ్మల్ని మేము కించపరచు కోటమే' అని కట్న కానుకల ప్రసక్తి రానీయలేదావిడ. ఆవిడ సంస్కారానికి విస్తుపోయి, అంతటి గొప్ప మనస్సు గలావిడ శిరికి అత్తగారు కావటం, శిరి అదృష్టంగా భావించి ఎంతో సంతోష పడ్డారు—ఇందిరా -రమణలు.

ఎంతో ఘనంగా పెళ్ళి జరపాలనుకున్న శిరి, సారథిల కోరిక ననుసరించి—నిరాడంబరంగా, తిరుపతిలో స్వామి సన్నిధిలో పెళ్ళి జరుపటానికి నిశ్చయించారు.

పెద్దలు నిర్ణయించిన ముహూర్తానికి— శిరి, సారథిల పెండ్లి తిరుమల స్వామి సన్నిధిలో నిరాడంబరంగా జరిగింది. పెళ్ళికి సారథి తరఫున, అతని పినతండ్రులు, వారి కుటుంబాలు, అతని అక్కా బావవారి పిల్లలు అంతా వచ్చారు. ఇటు రమణ తమ్ముళ్లు ఎవరూ రాలేదు—వస్తే ఖర్చే ననో— ఏదన్నా తమకి తగులతుందేమో

తని వారి భయం కావచ్చును. ఏవో కారణాలు చెప్పి— శిరి పెళ్ళికి తాము రాలేని లోటు లేకుండా జరిగించి ఆశీస్సున్నామని ఉత్తరాలు మాత్రం వచ్చాయి. చివరి తమ్ముడు మాత్రం శిరి పేరున వంద రూపాయలు బహుమతిగా పంపేడు. మీనాక్షి మాత్రం నలుగురి పిల్లల్తో వచ్చింది. ఆ మాత్రానికే రమణ, ఇందిరా ఎంతో సంతోషించారు.

మూడు నిద్రలనీ — అదనీ — అలాటి వేడుకలేమీ వద్దన్నది శిరి.

అందుకు తగినట్టే శిరి అత్తగారు పెండ్లి జరిగిన వెంటనే వారింటికి పంపమని కోరింది. వూళ్ళోనేగదా! కొత్త తీరే దాకా పంపుతూ పోతూ వుంటుంది—రమణా అందుకు ఒప్పుకున్నాడు.

శిరిలో తను ఆశించిన వుత్సాహం లేకపోవటం గమనించి ఎంతో బాధ పడింది ఇందిర. క్రమంగా అలవాటయితే ఆమే సర్దుకుంటుందని తృప్తిపడింది.

శిరి అత్తవారింటికి వెళ్ళబోతూ — అన్నా-వదినల కాళ్ళకు వంగి నమస్కారం చేసి కళ్ళనిండా నీరు నింపుకుని,

'అమ్మా—నాన్న లేని లోటు తీర్చి — ఎంతో అభిమానంగా చూసుకున్నారు — మీలాటి అన్నా — వదినలను పొందగలిగిన నేను ఎంతో అదృష్టవంతురాల్ని — తెలిసి తెలీక మీ మనస్సును నొప్పిస్తే — క్షమించండి అన్నయ్యా' అన్నది.

'ఛీ...అవేం మాటలే శిరీ— నేను నీకు పరాయి వాణ్ణి కాదు. అలా ఎప్పుడూ అనుకోవద్దు. నీకు ఎప్పుడు రావాలనిపిస్తే అప్పుడొచ్చి నాలుగు రోజులుండి వెళ్ళు. ఈ ఇంట నీకా చనువు-హక్కు వున్నాయమ్మా' అన్నాడు రమణ. ఆర్ద్రమైన కంఠంతో చెల్లెలి తలమీద చేయివేసి నిమిరి.

'వదినా!' అని కౌగిలించుకున్న శిరిని గాఢంగా గుండెల కదుముకున్నది ఇందిర. సొంతకూతుర్ని అత్తవారింటికి పంపుతున్నట్లే—ఆమెకళ్ళు చెరువులైపోయాయి. కంఠం పూడుకుపోయి మాట పెగిలిరాక 'సుఖంగా వెళ్ళిరామ్మా' అని మాత్రం ఎలాగో అనగలిగింది.

శిరి అత్తవారింటికి వెళ్ళిన దగ్గర నుండి ఇందిరకు ఏమీ తోచేది కాదు. ఎక్కడ కూచుంటే అక్కడే దిగులుపడి పోయేది.

# చరితార్థులు

ఏవేవిచేస్తున్న శిరేజ్ఞప్తికి వస్తూ—

అత్తవారింట కొత్తకాపరం ఎలా వుంటున్నదో? అని మదనపడేది.

అందునా శిరిమనస్సున రగిలేబాధ తనకు తెల్సును. ఆ బాధ మరిచిపోయి మామూలు మనిషి కావాలంటే ఎన్నిరోజులు పడుతుందో! విజయ సారధి అంతవోర్మి వహిస్తాడా? శిరి అతడితో ఎలా ఎడ్జెస్టు అవుతుందో? భగవాన్ మా శిరికి సుఖప్రదమైన జీవితాన్ని అనుగ్రహించు తండ్రీ, భగవంతుడికి రోజూ నమస్కరించేది. రమణతో రోజూ అదేప్రస్తావన, ఎవరు కనిపించినా, శిరి అత్తవారింట్లో ఎలా వున్నదో అని దిగులుగా కబుర్లు...శిరి వెళ్ళి సరీగా పదిహేను రోజులైనా కాకుండానే—చూసి రమ్మని భర్తను తరిమింది.

ఇదంతా చూస్తున్న మీనాక్షికి నోళ్ళు కారం రాసుకున్నట్లు—భగభగ లాడింది— ఈర్ష్య—అసూయలతో వుడికిపోతూ—

'అబ్బో-అబ్బో, ఆడబిడ్డమీద అంతగా ప్రేమ కారిపోతున్నట్లు ఏం బడాయి-ఏం నటన? ఇలాటి వాళ్ళని చాలమందిని చూశాం. మెత్తనికత్తులు. డాక్టరు కోర్సు చెప్పించామని ఘనంగా చెప్పకుంటున్నారు గాని, తవరి చేతి డబ్బా— ఏమన్నానా? అదంతా మా నాన్నగారు శిరి పెళ్ళికని బాంక్ లోవేసిన డబ్బేగా! అదంతా అయిపోయిందేమొ—అందుకే తవరి చేతిది ఖర్చు పెట్టాల్సి వస్తుందని గా — కొండమీద గుట్టుగా మూడుముళ్ళు వేయించారు. నాన్నేవుంటే ఇలా జరగనిచ్చేవారా? చివరి పిల్ల పెళ్ళి ఎంత వైభవంగా చేసేవారో— తమరుచేసిన ఈ లోటు తీయ తీయని కబుర్లతో కప్పి పుచ్చుకుంటూ — డాక్టరు ఆడబిడ్డతో ఏ అవసరమైనా రావచ్చునని— ప్రేమలు కారిపోతున్నట్లు కబుర్లు— లేకపోతే ఏనాడేవున్నదీ ఆ ప్రేమ-అందరం ఆడబిడ్డలమేగా—ఆవిడ ప్రత్యేకత ఏమిటి మరి-అయినా వెర్రిబాగుల్ది కనుక శిరి వాళ్ళమాటలన్నీ నిజమేనని నమ్మతోంది. నేనే అయితేనా?' అని తనలో అక్కస్సుగా అనుకుంటూ—అప్పుడప్పుడూ పైకె అనేస్తూ, ఇందిరను దెప్పిపొడిచి రచ్చ కీడ్చాలని చూసేది. కాని ఇందిరకు మీనాక్షి మనస్తత్వం బాగా తెల్సును అందుకే మాట మీరకుండా మర్యాద, జవాబులిస్తూ తప్పుకునేది. రమణ అసలు ఏమీ కల్పించుకునేవాడు కాదు—శిరిష్ చదువు కెంత ఖర్చు అయినది. పెళ్ళి కెంత అయినది—తండ్రి మిగిల్చిన డబ్బు ఇంకా వున్నదా! ఇత్యాది వివరాలు మీనాక్షి అడిగినప్పుడు, విని విననట్లు వూరుకునేవాడు రమణ. మీనాక్షి ఏమీ చేయలేక కసిగా పళ్ళు నూరుకున్నది. మరో నెలరోజులుండి మీనాక్షి తిరుగుప్రయాణం అయింది. పిల్లలకు, ఆమెకు, మూడు వందల రూపాయలు ఖర్చుచేసి బట్టలు తెచ్చేడు రమణ. చీర-రవిక-పసుపు కుంకుమలు— బొట్టుపెట్టి ఆడబడుచు చేతిలో పెట్టింది.

'ఏదో మా శక్తికొలది తెచ్చాం—లోటు జరిగితే క్షమించండి వదినగారూ' అన్నది ఇందిర.

మీనాక్షి మొహం విప్పారలేదు. 'క్షమించటానికి మేమెంతటివారం వదినా, నీమొగుడి సంపాదనలో నీకు హక్కువున్నట్లుగానే మాకూ హక్కువున్నది. ఏదో తోడబుట్టిన వారమనీ, చెల్లెలు పెళ్ళిగదా అని, చుట్టపుచూపుగావచ్చి నాలుగురోజులుండి పోతున్నాం—జానెడు రవికగుడ్డ పెట్టినా మాకు సంతోషమే! అయినా ఇష్టమయినవారికి ఇల్లు దోచిపెడ్తారుగాని, మాలాంటివాళ్ళ కెందుకు పెడ్తారు? మా అమ్మ — నాన్న ఎప్పుడుపోయారో—పుట్టింటి ముచ్చట్లు మాకు అప్పుడే తీరినయ్యి,' అని మనస్సులో పేరుకున్న అక్కసంతా వెళ్ళగక్కి బుడిబుడి దీర్ఘాలు తీసి బండెక్కిందావిడ. రమణ— ఇందిర, ముఖముఖాలు చూసుకుని నిట్టూర్చారు.

కొందరు ఇంటికివస్తే — మలయ మారుతంవీచి — పూలవానల జల్లుజల్లుగ కురిసినట్లు—ఇల్లంతా పరిమళావృతం అవుతుంది. మరికొందరేమో — సుడిగాలుల్నీ— రక్కసిపొదల్నీ వెంటపెట్టుకు వస్తారు— విపరీతమైన నైజం వారిది. ఎందరో మహానుభావులని ఒక్క నమస్కారంపెట్టి వూరుకోవాల్సిందేనని సర్దిచెప్పుకున్నారు ఇందిర— రమణలు.

(ఇంకా వుంది)

# ఆధునిక ప్రవక్త శ్రీ దాదాజీ

[పాఠకులకి సుపరిచితులయిన శ్రీ పిలకా గణపతిశాస్త్రిగారు పంపిన వ్యాసం ఒకటి ఈ క్రింద వేస్తున్నాము. —సం.]

శ్రీ దాదాజీని గురించి సుప్రసిద్ధ రచయిత శ్రీ ఆర్. ఎస్. సుదర్శనంగారి వల్ల ఇదివరకు మునుపే విన్నాను. నేడు దాదాజీ భారతదేశంలో అంతటా సుప్రఖ్యాతులు.

జులై 15వ తేదీన శ్రీ దాదాజీ మద్రాసు వచ్చారని విని ఆ మరునాడు ఆయన్ని సందర్శించాను. ఆ తరవాత ఆయన సమక్షంలో మహానామం స్వీకరించాలన్న కోరిక కూడా కలిగింది.

చిన్న తెల్లని కాగితం తీసుకుని, ఒక గదిలో ఏకాంతంగా కూర్చున్న ఆయన దగ్గిరికి వెళ్లాను. నన్ను గురించి ఆంగ్లంలో ప్రశ్నించారాయన. సంగ్రహంగా సమాధానం ఇచ్చాను. ఎదురుగా ఉన్న శ్రీ సత్యనారాయణ రూపపటానికి నమస్కరించమన్నారు. సాష్టాంగ నమస్కారం చేశాను. వెన్నుమీద మెల్లిగా తట్టారు. అత్యద్భుతమయిన సంఘటన జరిగింది!

నా చేతిలో ఉన్న తెల్లని కాగితం మీద గుండ్రంగా ఉన్న అక్షరాల తీరని తెలుగు పదాలు రెండు సాక్షాత్కరించాయి! నేనవి పైకి చదివాను. అదే మహానామమని, అది ఎవ్వరికీ చెప్పవద్దని ఆదేశించారాయన. అదే సదా మననం చేసుకోవలసిందని కూడా చెప్పారు. అప్పైన ఆ కాగితం మీది పదాలు రెండు అదృశ్యమయ్యాయి!

ఆ తరవాత మా ఇద్దరి మధ్య మరి కొంత సన్నిహిత పరిచయం కలిగింది. శ్రీ దాదాజీని ఆయన గదిలో కలుసుకున్నాను.

'మీకేమయినా సందేశం కావాలా?' అడిగారాయన. కావాలన్నాను. ఎదురుగా ఉన్న శ్రీ సత్యనారాయణ రూపపటానికి నమస్కరించమన్నారు. శ్రీ సత్యనారాయణ అంటే సాక్షాత్తు భగవానుడే అని వాక్రుచ్చి నక్కాణిస్తారు దాదాజీ. అన్ని అత్యద్భుత సంఘటనలు, అంటే మహానామ సాక్షాత్కారము మొదలయినవన్నీ ఆ భగవానుని అనుగ్రహం వల్లనే జరుగుతున్నాయని, ఆ సంఘటనలతో తమకేమాత్రము సంబంధం లేదని వివరిస్తారు దాదాజీ. అలాగే తామెవరికీ గురువులము కామనికూడా అంటారు. ఇలాగే దేశ జాతిమత కులవర్ణాది విభేదాలన్నింటిని వ్యతిరేకిస్తూ, మానవజాతి అంతా ఒకటే అని, ఇవి పట్టి మనుష్య కల్పితాలని గట్టిగా హెచ్చరిస్తారు దాదాజీ. మహానామమంటే భగవానుని నామధేయమయమయిన మహామంత్రమన్నమాట.

నేను నాలుగు పావుటావుల తెల్లకాగితాలు చేతిలో ఉంచుకుని శ్రీ సత్యనారాయణ కెదురుగా మోకరిల్లి కనుదోయి ముకుళించాను. మరికొన్ని క్షణాలలో కళ్లు తెరిచి చూసేసరికి రెండున్నర పుటలలో ఎర్రని అక్షరాలతో తెలుగులో సందేశం సాక్షాత్కరించింది! దాని సారాంశం :

'మానవుడు తన సనాతన కర్మానుగతమయిన బంధుమిత్రాదుల సాంఘిక వాతావరణంలోపడి మునిగితేలుతూ, ధన బంధనలలోపడి ఆ పరబ్రహ్మనే విస్మరిస్తున్నాడు. సుషుప్తిలో అదృశ్యమవుతున్న ఈ ప్రాపంచిక విషయాలమీద ఇంతటి వ్యామోహమేల? సదా మహానామస్మరణం ఫలితంగా మేలు చేకూర్చుతుంది. స్వార్థబుద్ధి వదలించుకొని దినదినము పరబ్రహ్మయందే మనసు నిలిపిన తప్పక బ్రహ్మ సాక్షాత్కారం లభించగలదు. అయితే ప్రకృతి సిద్ధంగా వస్తున్న విధి అనుభవించక తప్పదు. అప్పటికన్న పరబ్రహ్మ సాక్షాత్కార ప్రయత్నమే ప్రప్రథమ కర్తవ్యము.'

దీని చివర 'శ్రీశ్రీ సత్యనారాయణ' అన్న సంతకంకూడా వేరుగా ఉంది. లేని సందేశం జాగ్రత్తగా నా దగ్గిర భద్రపరుచుకున్నాను.

మానవులందరు యథాప్రకారంగా తమ సాంసారిక జీవితాలు గడుపుతూనే మహానామ మననంతోనే భగవానుని అనుభూతి పొందవచ్చునని దాదాజీ వివరిస్తారు. ఆశ్రమాలు, సన్యాసాలు, నియమనిష్ఠలు, జపతపాలు మొదలయినవన్నీ అనావశ్యకాలని ఆయన వివరిస్తారు. భగవానుని ఎడల సంపూర్ణ శరణాగతితోబాటు, స్వార్థరహిత భక్తితో మేళవించిన మహానామ మననం ఒక్కటే పరమ శరణ్యమని దాదాజీ ప్రవచిస్తారు. అయితే ఆయన సిద్ధాంత రీత్యా అద్వైతవాది. కాని సాధనలో పరమభక్తి ఉపదేశిస్తారు. దానివల్లనే సర్వము సమకూరగలదని, జీవితంలో ఎదురవుతున్న కష్టనష్టాలన్నీ ఓరిమితో, ధైర్యంతో సహించడమే గొప్ప తపస్సని వ్యాఖ్యానిస్తారు.

దాదాజీ మన అందరిలాగే గృహస్థులు. ఆయన అసలు పేరు అమియరాయ్‌చౌధురి. అందరు ఆయన్ని ప్రేమతో ఆప్యాయంగా దాదాజీ [అన్న] అని పిలుస్తున్నారు. అదే విధమయిన వైఖరి అందరు అవలంబించాలని ఆయన అభిలాష. తామెవ్వరో మహాగురువులమని భావించడము, మొదలయినవేవీ ఆయనకెంతమాత్రము రుచించవు. ఇలాగే గంభీరోపన్యాసాలు వాదోపవాదాలు మొదలయిన ఆడంబరాల కన్నింటికీ దాదాజీ విముఖులు.

నేనెరిగినంత వరకు దాదాజీని గురించి మూడు ఆంగ్ల సంపుటాలు వెలువడ్డాయి. ఈ సంపుటాలను గురించి, దాదాజీని గురించి తెలుసుకోదలచిన వారు 'శ్రీ ఎ. దాస్ గుప్త, 209B, లాన్స్‌డౌన్ రోడ్, కలకత్తా-29. ఫోన్ 46-4044' అన్న చిరునామాతో ఉత్తరప్రత్యుత్తరాల ద్వారా వివరాలు సేకరించవచ్చును. ●



శ్రీ దా దా జీ.

# ప్రశ్నావళి

**...కె. రామలక్ష్మి....**

**ఎమ్. వి. ఎస్. ఆర్, రాజమండ్రి**

**రామలక్ష్మిగారూ, మనిషికి జీవితంలో శాశ్వత సుఖం యిచ్చేది ఏమిటి ?**

సంతృప్తి. అది అసంభవం కనుక మనిషికీ జీవితంలో శాశ్వత సుఖం— ఎండ మావి.

**కె. ఎమ్. ఎమ్, జగిత్యాల**

**మానవులలో ఓర్పు ఎంతవరకు వుంటుంది చెప్పకలరా ?**

స్వలాభం ఇన్ వాల్వ్ అయి లేక పోతే ఎంతేనా ఓర్పు ప్రకటిస్తాడు మనిషి.

**జి. బి, బావర్ (ఆదిలాబాదు)**

**ఈనాటి సినిమాలలో ప్రదర్శించు స్త్రీల వస్త్రధారణ నాగరికతా ? అనాగరికతా ?**

అసలు సినిమాలో స్త్రీలు—పాత్రలు—అనుకుంటే— మీకీ బెంగ వుండదు. వారు ఏ స్త్రీలకీ—ప్రతి రూపాలుకాదు. ఆ తార— దర్శకుడు నిర్మాతల వూహలకి రూప కల్పనలు వాళ్ళు. (ఒక్కొక్కప్పుడు రచయిత రూప కల్పన కూడావుంటూ వుంటుందిట!)

**కె. ఎమ్, ఆర్, తెనాలి**

**ఏలాగైనా మీ జాతి మీద ఒక పాలు శ్రద్ధ ఎక్కువ వహిస్తారు. అవునా ?**

నిజమే— మాదీ వెనుకబడిన జాతి కిందే వస్తుంది—కదండీ—ఆ మాత్రం ప్రత్యేకతలుప్రకటించక పోతే—ముందు కెలా రాగలం?!

**వై. ఎస్, ఎమ్. బెలదోణ (కర్నూలు)**

**డబ్బుకి మనిషి బానిసా? మనిషికి డబ్బు బానిసా?**

సంపాదించే దాకా డబ్బు మనకి బానిస. తరువాత దానికి మనం బానిసలం.

**టి. హెచ్. ఆర్, రేపుగోపాలపురం**

**ప్ర భారతీయుని పవిత్ర ఆశయం ఏమిటో చెప్పకలరా?**

తన స్వంత పార్టీ పెట్టుకుని — అధికారానికి వద్దామని!!

**శ. ఆర. ఎస, శ్రీకాకుళం**

**జీవితం మీద విరక్తి ఎందుకు వుడుతుంది?**

తను అనుకున్నట్టు జరగనప్పుడు.

**పి. కె. వి, పెనుగొండ**

**వైరాగ్యమా ? వైవాహిక జీవితమా ? ఈ రెండిటిలో మానవ జీవితానికి శాశ్వతానందం కల్గించేదేది ?**

విరాగిగా సాంసారిక యాత్ర సాగించకలవాడే యోగి. యోగీంద్రులకు మించిన చిదానందం ఎవరికి లభ్యం అవుతుంది?!

**ఎస్. కె. ఎస్, అలంపూరు**

**విషాన్ని భరిస్తున్న మనిషి తనకు కావలసిన వారినుండి తన విషాదానికి గుర్తింపు కోరుకుంటాడు. అలా కోరడం తప్పా ?**

తప్పుకాదు. అత్యాశ. మనం కోరకుండా సానుభూతి చూపడం సహజం. మనం కోరి సానుభూతి గ్రహించాలని తాపత్రయపడ్డం అసహజం.

**ఎన్. ఎస్. వి. ఆర్, ఆమదాలవలస**

**ఈ కాలంలో స్త్రీకి స్వాతంత్ర్యం కావాలని రేడియోలోను పత్రికలలోను వింటున్నాను. చదువుతున్నాను. స్వాతంత్ర్యం వస్తే—ఏంచేస్తారు ?**

బ్యాంకులో వేసుకుంటాం! అవసరం అయితే అమ్ముకుంటాం!

**ఎ. టి, పెనుగొండ**

**మీ హిస్టరీ రాయాలని వుంది. అనుమతిస్తారా ?**

ఇంకా చరిత్ర కెక్కనిదే ఏం రాస్తావు తాతాలూ. కొంచెం వోపిక పట్టు.

**టి. ఎస్, కె, హైద్రాబాదు**

**మీరు ఏలా గతములో (స్వతంత్రము రాకముందు) ప్రశ్నలకి సమాధానాలిస్తారు?**

స్వతంత్రం మనకి రాకముందు కూడా భారత దేశం అనే ఓ దేశం వుందనీ, దానికి చరిత్ర వుందనీ, చరిత్ర పుస్తకాలలో చదువ లేదా! తమ్ముడూ.

**ఎన్, ఆర్, తాళ్ళపొద్దుటూరు**

**దేవునికి మానవునికి తేడా ఏమిటి ? త్వరలో తెలుపండి. ప్లీజ్. ఆలస్యం అయితే డేంజరు...**

మంచి మనిషే దేవుడు— రంగయ్యగారూ, మీ డేంజరు గడిచింది కదా! హమ్మయ్య.

**జి వి. ఆర్, కె, వీరవాసం**

**నేటి సమాజానికి కావలసినది ఏమిటి ?**

నిజాయితీ. ●

'ప్రశ్నావళి' శీర్షికకి ప్రశ్నలను పంపేవారు కవరుమీద ప్రస్ఫుటంగా 'ప్రశ్నావళి,' ఆంధ్ర సచిత్ర వార పత్రిక, మద్రాసు — 1.' అని వ్రాయకోరుతున్నాము.— సం॥




Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1 and at Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada 3. Editor : S. Radhakrishna.




అశోకా శాండల్ వుడ్ (Regd)

ఫేస్-టాల్కం & ఆల్ పర్పస్ పౌడర్లు

ఈప్రశిద్ధి పొందిన పౌడర్లు-సదా ఉపయోగించిన
సమస్త చర్మబాధలను నిరోధించి చర్మమును
మృదువుగాను కాంతివంతముగా చేయును

విజయా కెమికల్సు, మద్రాసు-7.